చ॥ మఱియుదినాధినాథుబలె • మవ్వఁపుఁదేజుననొప్పువాని జ
క్కులపుఁబోఁడిదాల్పువిలు • కైవడిపెల్లగుమేనివాని బం
ధురతరబాడబాగ్నిగతిఁ • దోఁచెడువాలమువానియామ్య ది
క్తరుణప్రతాపతుల్యముఖ • తామరసమ్ముఁగలానివాలినిన్ ॥ 121

మ॥ కనిసామాన్యపుఁగొమ్మద్రిమ్మరిగ హృ • త్కంజంబునం దెంచియై మం
ద్రిని మాయాబలకౌశలంబునన దో • ర్వీర్యంబడంపంగనౌ
నని వంచించిస్వపుష్పకంబుడిగి మున్ • స్వామాత్యులంతంతగ
న్గానిమెచ్చన్మహిమెల్లగానిడుచు న • ద్గుల్ప్రాంతకుం జేరగాన్ 122

మ॥ అడుగుల్ చప్పుడొకింతవిన్పడఁగనిం • ద్రారిందృగంతంబులం
గడకంగన్గొనిమాయఁదన్నుఁగెలువం • గావచ్చునంచైంద్రిలీ
డుడుగండీఖలునాల్గుసంద్రములయుం • తొండోండగతుంబులం
దిడిసేనంచుమనంబునందలచియెం • త్తైనిష్ఠమైనుండఁగన్ ॥ 123

(వాలిరావణుగర్వంబడంచి పరిభవించుట)

ఉ॥ మెల్లఁగఁగాలునేలపయి • మెట్టుచుఁబశ్చిమదిక్కు జేరి యా
ప్రల్లదుఁడెల్లనెమ్మెయి ని • ప్రక్కకునొత్తిగిలంగఁజేసి మె
న్మెల్లన జేతులాఘనుని • మీఁదికిఁజాచినాతఁడేనుఁగుం
జల్లగఁబట్టుకేసరిపసందన • చంకలనొక్కెవానినిన్ 124

ఉత్సాహ॥ పాముఁగాలఁద్రొక్కిపట్టి • పాఱుపక్కిరాయడ
ట్లాముగ్రుంగరాక్షసేంద్రు • నంగకమ్ములన్నిటిం
దీమసముననొత్తిపట్టి • దేవసిద్ధసాధ్యులీ
తామసునకునిట్లుగాగ, • దగునటంచునునుబ్బనా
భీమబలుఁడువేచెదివికిఁ • బిట్టపోల్కెఁబుట్టునన్ 125

వ॥ ఇట్లింద్రుపట్టి విహాయసమార్గంబునంబడమటి కడలిదరికరుగుడంత
కుమున్న. 126

మ॥ స్తనితంబుల్ వలెబెబ్బులుల్ వత్రబహ • స్తాదుల్ మొగిల్ తెన్నున
జ్ఞనువాలింగసనడ్డగించివెనుకం • దద్వాలజంఝానిలం
బునకుందూలికలట్లమేఘపటలం • బుల్ పోల్కెఁజీకాకునొం

దినభోమార్గమునందుదిక్కు కొక్కడై ♦ నిల్వంగలేకేగెరా 127

క॥ ధారుణిరేణువుగొనిచను మారుతముంబోలెవాలి♦మాంసాశినిటుల్
జేరిచిపశ్చిమజలనిధి పేరిమిమ్రుగ్గుంకులాడి♦విధ్యుక్తముగన్ 128

ఉ॥ వాలితదబ్ధియందుజరు ♦ పంగలసత్క్రియలెల్లజల్పి తా
నైలబిలాశనుండిన మ ♦ హాబ్ధికినేగిమునింగి, రావణుం
గేళినిజంకలందు నిఱి ♦ కించియు, బూర్వసముద్రనాయకుం
బాళినిజేరి, గ్రుంకులిడి ♦ భక్తిజపమ్మొనరించి తద్విధిన్॥ 129

చ॥ ఇటుజతురబ్ధులందు గృత ♦ కృత్యుఁడునై పురుహూతసూతి; త
త్కుటిలునితోడవేగదన ♦ కొట్టికకుంజని; వానిఁదద్వనిన్
దటుకునజంకనుండి విడి ♦ తత్క్షణమెర్గనివాఁడపోలెనో
పటుజవ! యేడనుండిటకు ♦ వచ్చితివేమని పల్కరింపఁగాన్॥ 130

శా॥ వీతాహంక్రియుఁడై, దృగంతములజో ♦ బ్బిల్లంగఁ బాష్పాంబువుల్
వాతాకంపితవృక్షమట్లతనువా ♦ పాదంబుస్వేదాన్వితం
బై, తూలందతభీతిఁ; గద్గదనినా ♦ దాన్వితుండై పిత్రభ్రా
జాతుండైంద్రికివల్కునిప్డు జననీ ♦ జాతుండనై తంగ్రిగన్॥ 131

ఉ॥ నీవెమహాబలాఢ్యుఁడవు, ♦ నీవెకృపామృతవారిరాశివిన్
నీవెసునిశ్చలాత్ముఁడవు, ♦ నీవెమహాధృతిశాలి, వెన్నగా
నీవె ప్రతాపసింహుఁడవు, ♦ నీమహిమంగనుగొంటినేఁడు నా
కీవె వివేకసంపద, గ ♦ పీశ! యడంపవె మన్మదాంధతన్॥ 132

ఉ॥ తారధరంబునెత్తితి, స ♦ దాశివుచేతను ఖడ్గమందితిన్
వీరవరేణ్యులందివిజ ♦ వీరులగెల్చితి, నట్టినన్ను నీ
సారతరంపుగక్షముల ♦ చాటునమాటి చతుఃపయోధులం
బీరముమీర ముంచితివి; ♦ భీమపరాక్రమ! నీదుమ్రోలనా
శూరత, లావు, పెన్నవృధ ♦ సూ;మఱిసిగ్గుఘటించొరుల్ వినన్॥ 133

వ॥ మఱియు 134

క॥ మారుతవేగం, బల్లయ నూరుననుజరయము, నమ్మ ♦ నోవేగంబుం
గేరుభవజ్జవ,మెన్నగ నారూఢిలవంబుపెనగ ♦ నవివచ్చునొకో॥ 135

క॥ సుర,గరు, డోరగ, నర, ఖే; చర, కిన్నర, సిద్ధ, సాధ్య, సంఘంబులలోఁ
పరికింప,నీకుసరిపోటరివిక్రముఁడొక్కఁడుగల◆డాజగములలోన్॥ 136

క॥ ఇచ్చకముగాదుసుమ్ము,వి;యచ్చరరాణ్ణందనమణి!◆యఖిలజగములం
దెచ్చటఁగన్నను,నీకెనవచ్చుఘనుండున్న జూ◆పవచ్చునొకనిన్॥137

క॥ నాకన్నవు; నక్కజుఁబలె; నీకనుగుందమ్ముగుఱ్ఱ◆ నేను, నిరుపురం
బేకము; పొందుజలుపుదము; నీకల్మియనాదుకల్మి◆ నేనీ,లెంకన్॥138

క॥ పురుహూతతనయ! యిమ్మహినిరుపురముంబ్రాలునీరు◆ నెట్లట్లెపుడున్
దిరుపుదముకలసి;చూపరులిరుబొందులకాని,చిత్త◆మేకంబనఁగన్॥139

చం॥ అనిపలుకంగ; నల్లెయని◆ యైంద్రి, పులస్త్యకులాబ్ధిచంద్రుఁడో
డ్కొనిపురమేగి; తమ్మునకుఁ◆ గొబ్బునరావణువార్తదెల్పి, కూ
ర్మినిదశకంఠు; దమ్మునికి◆ మిక్కిలిగాఁగని, భూరిభూషలం
గనకపటమ్ములిచ్చి, రుచి◆ గల్గిన విందొనరించి వేడ్కమై॥ 140

క॥ హరిపతికెనయనదగునాహరిపతికడనొక్కమాస◆ముటువుచ్చియు,నా
సురపతినిజపురికరిగెనుసురపతిసుతుఁడనుపఁగా,న◆సురబలములతోన్141

సీ॥ కెరలివచ్చురిపుశి◆క్షింపనేర్చుటకాదు; కేల్మోడ్చురిపుని◆రక్షింపనేర్తు
నాత్మశత్రులగర్వ◆మార్పనేర్చుటగాదు; తెలివినట్టిరిరహి◆దేర్పనేర్తు
శివదూషణులనుభం◆జింపనేర్చుటకాదు;శివభూషణులనురం◆జింపనేర్తు
దుష్టులవెతలలోఁ◆దూర్పనేర్చుటకాదు;శిష్టులహితులలోఁ◆జేర్పనేర్తు
పెద్దలనుశ్రద్ధఁగాంతు◆ బెరిమనెంతు
భీరులనుగూర్మినలరింతు◆ బేర్మిబెంతు
న్నాత్మబలములరహిఁగాంతు◆నరులనొంతు
పద్మసంభూతపౌత్రులు◆బ్రోషిమింతు॥ 142

క॥ ఈకరణి, నగవిదార, వి; భాకరనందనులునసుర◆బంపి, సుగుణర
త్నాకరులుయశోవిజితసు;ధాకరులనిశూరులెన్నఁదనరిరివిభుతన్143

వ॥ ఇట్లు వాలి సుగ్రీవులు నీరక్షీరంబులభాతి గలసి సుఖంబుండనంత
మఱియు నొక్కనాఁడు 144

(నిశాముఖంబున వాలిపై దుందుభి దురమ్మునకేఁగుట.)

సీ॥ దుందుభినాముండు • దున్నరక్కసుఁడొండు; మాయావి తమ్ముండు •
మయుసుతుండు। శంకరోర్వీధర • సంకాశ తేజుండు; మహితసహస్ర
సా • మజబలుండు। నెమ్మిమీరశివుండునిల్చినవరముండు; నంతబ్రమ
త్తుండు • నై యతండు। జోకమున్నీరుండు • చోటికినొక్కండు; నరిగి
నాతోరండు • ననికనుండు।

నవుడుసాగరుండు • నక్కటానీతండు; క్రొవ్విచివ్వనొండు • కొరిగండు
మీరివచ్చెజుండు • మేదినినిమనండు; నింకతడవునుండు • టెట్టులెండు॥145

క॥ లోలోననిట్టులనుకొని; శ్రీలోలాక్షీగురుండు • చెచ్చెరచెంతం
దైత్యలోక్యవైరిదుందుభి; నాలోకనసేసిపల్కు • నతఁడుప్పొంగన్॥146

క॥ ఏనెంతవాడనం, చని; కూనెదనీతోడనీమ • హాగ్రార్భటిదో
ర్ద్యో నెంతవానికళ్ళుకును; లోనెరయగ జేయదే వి • లోకనసేయన్॥147

ఉ॥ కావ్రననేననీకు సరి • కాను, బలాఢ్యుఁడవీవు, కొండరా
తావునకేగు వేగమ, యం • తండు భవానిగురుండు, నమ్మహా
దేవుననుంగుమామ యల • ద్వీపవతీపరిసేవితుండు, నీ
లావునకామహామహుని • లావున కీడుగదాతలంపగన్॥ 148

క॥ అనినచ్చబలికిపంపిన; బనివినిపలలాసికాంచె • బర్వతపతినిన్
మునిరాజపరివృతుని,గుణ; ఖని,మణిఖనియుతునిమేన • కారమణిపతిన్ 149

క॥ కనితద్గండోపలముల, ఘనశృంగమ్ములవకావ • కలుగాఁబగులం
గనుదాకితదాశ్రయులగు,మునులకతిక్షోభవాఁడు • మొగిగావించెన్॥150

మ॥ ఇటుగావింప, నుమాగురుండు దెలిమే • నేపారఁగావచ్చి త
త్పటుగాత్రుంబొడగాంచి, దుందుభికృపా • పాథోధి వే; నీవు, నన్
జటిరాడాశ్రయుశృంగభంగ మొనరిం • చంజెల్లునానావుడ
క్కటిలుండాడటులేనిజూపగదె, నా • కుందీటుగా నొక్కనిన్॥ 151

వ॥ అనిన హైమవతీగురుండతనికిట్లనియె. 152

క॥ ఋతువిరజాగ్రహూనుఁడు ఋతువిభుసమానయశుఁడు • పృథుకిష్కింధా
ధృతుఁడతిబలుఁడుజితప్రతి పక్షుఁడహీనుఁడగువాలి • పాలికరుగుము॥153

చ॥ అఱిగినవాలి సీదయిన • యాహవకాంక్షనుదీర్చు, వైరులం
దఱిగినవాఁడు, నింద్రుసరి • నాదగువాఁడన, బోయెనైంద్రినా
బరగినవాలిఁ జేర, జని • వానిపురోపవనమ్మునందు, గొం
తరగినదాకనార్చి, మహితార్భటిఁగూల్చెఁ గుజాళిగొమ్మలన్ ॥ 154

క॥ దుందుభిరక్కసుఁడలసుర; దుందుభివర్షాంబుదములతోనెనగాఁ, దా
గ్రందుగ రవమటు సేయఁగ, నైంద్రిస్వదారయగు తార • నదికి మురువన్నిన్ 155

తే॥ గీ॥ ఉండి స్వాంతఃపురమ్మునం • దోలిత ద్రవంబు చెవిబడ నాలించి వాలు
గంట్లు! త్రోడఁజను వెంచి ర కాసి • త్రోడఁ బల్కు ; మహితవర్షాబ్దరవ
ము సమమ్ముగాఁగ॥ 156

ఉ॥ క్రందుఁగఁగన్నుఁగానక సంగర్వుడవై యిటులార్చెదేల, రో
దుందుభి! నిన్ను నే నెరుగుదుం; ధరణిస్థలిఁగొన్ని నాళ్ళ నీ
వుందువ యేని, యీయెడను • నుండక వేచను, మేడకేసి, మే
నందున "ప్రాణమున్న బలు • సాకును నేఱితినంగ రావొకో!" 157

ఉ॥ నావుడు రక్కసుండు కపి • నాయక! కాంతల ప్రోలదంభముల్
సీవిటు బిట్టుగొట్టదగు • నే, మొనకాడ వెనీవిసీ! కద్దు
న్నావుగ లాడవేని, నిశి • నాకిపుడే చనుదెమ్ము చివ్వ, కీ
వావిధిగాదయేని, నళి • నాక్షులగూడుము ప్రేగునంతకున్ ॥ 158

వ॥ అదియునుంగాక నింకొక్కటివినుము. 159

ఉ॥ ఇమ్మున కేగు, మర్ధతలి • కిమ్మునభీష్టము లాంద్రమంచి కెం
దమ్మున గౌగిలింపుము, ముం • దమ్మున నందటజూచికొమ్ము, రా
జ్యమ్మున నీసమానుని రం • యమ్మున నిల్పుము, రమ్ము వెన్క యు
ద్ధమ్మున కీవు, నీదగు మం • దమ్మున డం చెదఁ బోర, వెండియున్ ॥ 160

ఆ॥ పానమత్తు, జత్తం • మానన త్తమ్మాను; హాని, నిద్రమత్తుం • వాని, మించు
బోగ్లకేళిఁగాల • ముంబుచ్చు వానిని; గూడిదుర మొనర్పం • గూడ దెపుడు 161

క॥ మఱియు, నం • నాత్తాయుధు, నుక్కఱి, వెస్న చ్చినవిభీరు • నంగవిహీనున్
శరణన్నవానిఁ దాకిన బరగంగా, భ్రూణహత్యం • బ్రాపించైంద్రీ! 162

ఉ॥ నావుడుమందహాసవదనమ్మున నైంద్రిస్వదారఁ దార, ద

జీవనజాతనేత్రలు వసించెడు తావునకంపి, గండుమై
దైవతశత్రుగాంచి, సమందమ్మున బల్కెదవోరిరమ్ము నా
లావునునీవుగన్గొనఁగఁ లాడవయేని దురమ్ము సేయఁగన్॥ 163

క॥ అనిమున్ను జనకుఁడిచ్చిన; కనకంపువరాలపేరు గళమునఁనిడి, పో
రునకువడిగవిసె; మాంసా,శనకులపుంబాడబాగ్ని సముదుందుభితోన్॥

మ॥ పటుఘీంకారముఁ సేయు మత్తకరిపైఁ బాహాబలంబార ది
క్తటులల్లాడఁగ నుప్పళించెడు మృగేంద్రంబుం దరంబెంచితా
నిటులాదుందుభిదాకి, శృంగముల నెంతేపట్టి వాపోవదోః
పటుతంద్రిప్పప్రసరించె ముక్కునుదరీ భాగంబునన్ రక్తమున్॥ 165

వ॥ అంతట నప్పట్టునప్పించకొని, పొట్టక్రొవ్వునందుండు రక్కసుం, డిలాతలంబునకుఁ గప్పించి దుముకుటయు, నింద్రుపట్టి, ధట్టించి నెట్టి పట్టి, మోకాళుల, మోచేతుల, బాదంబులం ద్రోచి తాచిన, నెన్నిక వాడు మగుడ నెదుర్చి పోరుటయు 166

క॥ ఇతరేతరజయకాంక్షుల మతకరులనవారు ఘోరమాత్సర్యమునం
దితిజుబలమడగ్గె,నిర్జర పతిసుతుబలమెసగె నుదయభాస్కరుపగిదిన్ 167

ఉ॥ హీనబలుండువాడగు, దంహీనబలుండగు వాలికాంచి, దో
ర్ద్రోనవిషాణయుగ్మమును జుల్చి, స్వముష్టిబలంపుఁదాకునం
దాశవుబిల్కుమార్చిజతనమ్మగ గాళులువట్టిత్రిప్పి బీ
రాన నొకామడావలనఁ ద్రావాలగవైచె; లసద్బలమ్మునన్॥ 168

(మతంగముని వాలికి శాపంబిచ్చుట)

సీ॥ వైచిన,నధిసమీపమ్మునగలఋశ్యమూకాద్రినిమతంగమునితపోవ
నమ్మున ద్రావాలి వృక్షమ్ముల జంఝానిలమ్ముగూర్చివలాగు వమ్ముసేసె
తద్రక్తమాభూమిఁ దొరుపఁగా,నమ్మౌని;కోపించియెవ్వాడొ కుమతియగుచు
నీలాగుసేసెనా పాలసుడిది మొద; లీపర్వతమ్ముద్రొక్కవానిశీర్ష
మ్మట్టెబదినూరుఖండంబులగుచుజచ్చు! నదియకాకుండ;నాతనియాప్తు
లెవ్వరచోటుజొచ్చినన్నారీతినగుదురనియె! నదియెఱిగివాలియచ్చోటి
కరుగడయ్యె॥ 169

వ॥ అనిన విని వారలటమీద నెబ్భంగి బ్రవర్తించి రతిపొంగింపుమని దుర్గ, భర్గు నెచ్చరించునట్లు, లవ్వేల్పు చెపులతపసి జెట్టిం, జన్నిగట్టులోక్కఁబె ట్టున నిటలపట్టిక గేలుదోయిమెట్టి మ్రొక్కియడుగుటయు 170

ఆశ్వాసాంతము.

వృత్తకందద్విపదగర్భితసీసము.

సుజనసంస్తుత్య! విశుద్ధసత్వగుణ!వర్షాబ్దాభదానాధరా శ్రితాప్త!
సుజనసన్మాన్య! యశోనిశారమణ!స్వర్ణాన్యాభ భోగాకరా! దయాబ్ధి!
భువనజాక్షీమణిముత్యమారమణ!శుంభద్దైవ్యభ వప్రాభవా! కృతిహిత!
భువనజాక్షీస్మర! భూసురాదరణ!శశ్వద్రాజమాంబోద్భవా! ఘనమతి!
కమ్మకులవార్ధిచంద్రను! కమ్మనగొన
వు, రతనాలకల్మిగలాడ! పురుషవర్య!
నెమ్మిగలవాడ! సత్కవిసమ్మదకర!
స్తోత్రజనక సత్కులజాత! సోర్బలాఢ్య! 171

శైలబంధము.

క॥ వరకీర్తనీయ!రమణీస్మర! న్యాయార్జితధనాఢ్య! మాన్యాఖ్యధరా!
వరకవిరచితకృతిప్రియ! ఖరకరనందనవితీర్ణ! ఘనసద్వర్ణా! 172

మాలిని॥ కవిపికసహకారా! కాంచనోర్వీధ్రధీరా!
సవినయగుణహారా! శౌర్యధైర్యప్రచారా!
ప్రవిమలమతిసారా! రాజమాంబాకుమారా!
కవిభరణవిచారా! కల్పవృక్షోపతారా! 173





# శ్రీమత్సుగ్రీవపట్టాభిషేకము

## చతుర్థాశ్వాసము.

క॥ శ్రీమద్వైష్ణవభక్త స్తోమసుధాధామ! కావ్యంతోయజనేత్రీ
కామ! దయాగుణజిత లక్ష్మీమహిళాకామ! శ్రీపంకీరయనామా! 1

క॥ అటమీఁది తెలుఁగువినుఁడు; త్కటకరుణాంద్రధరుఁడు కాళికిక్షితిభృ
త్తటకమునను శుభవమ్మున; నటనాథుఁడు సెప్పెమునులకవలికతావిన్

(మాయావి కిష్కింధాపురీ ద్వారములో జేరి గర్జిలుట)

ఉ॥ ఠీవులుమీరఁ బావనిఁగదించిమగంటిమిఁగూడివాలి సు
గ్రీవులు నెప్పటట్ల దమగేములనుండ; నొకప్డు నా, లస
ద్భావులు రాత్రిమైమఱచి పండినవేళ, మయాత్మజుండు మా
యావి, లసద్బలుండు మహితార్భటి ద్వారమునాగి గర్జిలెన్॥ 3

శా॥ ఆగర్జారవమాలకించి ఘనరోషావేశమేపారగా
వేగంబానుపుఁడిగ్గి, హాసిపయిదోర్వీర్యంబునందూకబో
గాఁ, గంజాక్షియుఁ దమ్ముఁడీమొనలఁబోఁగాఁ జెల్లదంచెన్నఁ, వా
నాగన్‌డాతఁడు; శూరపుంగవునకిట్లాడంగధర్మంబొకో॥ 4

ఉ॥ దుందుభిపూర్వజుం డొడరి దోర్బలమారగ దాకినట్టి సం
క్రందనసూతికూతగవికర్తనసూతియరింగెఁ గాంజరీ
నందనుబట్టణంబున జనంబులఁగావఁగఁబెట్టిసుందరీ
బృందముసద్దడంచి వినిక్రృత్తవికోధినరూధియర్కుఁడాన్ ॥ 5

(వాలి సుగ్రీవులు మాయావిందాకుట)

ఉ॥ అట్టులుప్రాయిబెబ్బులులయట్టులుదాకిరివాని నాజగా
జెట్టులు, తాకగాభయముజెందకవాఁడును హుమ్మటంచుదాఁ
జెట్టులుబిట్టుపీకిదనచేదిటవారఁగవారిసేయు, బెం
గట్టులుబెల్లగించి భుజగర్వమునందగ వారునూకిరా॥ 6

క॥ వారిరువురదానొక్కఁడు। ధారిణిగూల్పవలెనంచుఁ • దైత్యేంద్రుండుర్।
వారిరువురతనిగూల్పఁగఁ। బోరిరిసమబలిమిజాల • బ్రొద్దుజయేచ్ఛన్ 7
ఉ॥ అంతటవాఁడు కొంతవర • కాత్మబలంబడఁగంగ, వారిన
ల్లంతట బాఱదోలి మహి • తార్భటిబాఱఁగ, వాలియున్ రుమా
కాంతుఁడు దోనవెన్నడిరి, • కల్వలరాయనివెల్గుదోడ్వదన్
బంతమెలర్పవాఁడు నొక • పర్వతరాడ్గుహజొచ్చెఁ బల్వడిన్ 8
తే॥ వల్లరీచ్ఛన్నదుర్గమ్మువరబిలమ్ముజొచ్చియిటుకన్నెఱింగినసోకునడప
వలయునంచెంచి, వెన్నంటివచ్చుముద్దుదమ్మునకుఱ్ఱ్రకనందనుఁడువలికె
చ॥ అనుజుఁడ! యీగుహాముఖము • నందువసింపుమునీవు, నేనునీ
దనుజునడంచినచ్చెదము • దమ్మున, నేనిట బెద్దనుండ నీ
వనుపుగఁ జేయఁగావలయు • నా! రణమంచనినాడ నాహవం
బున రణకోవిదుల్ బొగడ • బోరఁగ లేవను శంకఁగాదునూ! 10
మ॥ అనివాక్కుచ్చిన భ్రాతపల్కువినియ • య్యర్కాత్మజుండన్న! నీ
వనినట్లద్దిన రేసురద్విషులమా • యల్ పెక్కులొక్కండవీ
వనికింబోవఁగఁ జెల్లదేనునట సా • హాయ్యంబుగావత్తు నీ
కనిసౌహార్దము భ్రాతృభావమునునే • పారంగఁబల్కెందగన్ 11
(వాలి తమ్మునిగుహాముఖమున నిడి లోపలికేగుట)
క॥ అనిపలికిన నవ్వాలియు ననుగుందంఘ్రిపదయుగము • లానజుమీాయం
చినజుఁగుహాముఖముననిల్పి,నడచె,రాకాసిజేని • వెన్నంటివడిన్ 12
చ॥ ఇటునిబిడాంధకారచయ • మెల్లెడబర్వభయప్రదంబునై
పటుతరమాగుహాంతరము • భంగురభంగిగమించి వానినో
కుటిలుడ! పోకుపోకుమని • ఘోరతరంబుగ నార్పుచుందదా
ర్భటిగుహాబూరుమ్రోతలిడవాసవ • సూనుఁడుగో సెకోసిన్ 13
వ॥ ఇట్లొక్కయేడుదాటినంత వానిగాంచితాకిన 14
తే॥ కరధృతప్రస్తరుండయి • కర్బురేంద్రుఁ
డుక్కునవాలిరొమ్మున • నొక్కపెట్టు
బెట్టవజ్రాభనావాని • పేరురము;
నడచి పదినూరుఖండమ్ము • లయ్యెనదియు 15

క॥ మెటరి రక్కసుబిడ్డలిటు పోటుననన్నాగి వోడువ ♦ భ్రూమధ్యమునన్
బోటుననగురిసె రక్తము,మాటికినాసావివరవు ♦ మార్గములవడిన్
వ॥ ఇట్లితరేతరజయకాంక్షులకయ్యారుపురుంబోరుచుండిరంతనిక్కడ. 17
శా॥ భ్రాంతింజెంతమెగాలు గ్రో ♦ లవడిరా; రక్తప్రవాహంబులం
తంతన్ఫేనముతోడవచ్చె విమతా ♦ హంకారనాదంబుల
త్యంతబున్వినవచ్చె, మ్రోగగుహయుం; ♦ దద్వాలిరావంబు ర
వ్వంతైన న్వినరాకపోయె, రవిజుం ♦ డార్తిన్ వెసం బ్రుంగఁగాన్ 18
తే॥ అంతసుగ్రీవుండేడాది ♦ యైనగాని
యన్నరాడాయె ప్రతిపక్షు ♦ లార్భటిగుహ
యించె నిదియేమియక్కటా ♦ యంచెడంద
జింతచేఁదలపోసె నో ♦ క్కింతసేపు. 19

[సుగ్రీవుఁడన్న నిహతుఁడయ్యెనని పురంబు జేరుట]

ఉ॥ ఇటుదలపోసి వాలినసు ♦ రేంద్రుఁడడంచెవటంచునెంచి త
త్కుటిలుఁడు రాకయుండనొక ♦ కొండను తద్గుహవాత ద్రోసి, త
త్పటుజవుఁడార్తినన్నకుయ ♦ ధావిధివిస్ఫురితిలోదకాలు, న
ప్పటికనులై నలాగున స్వ ♦ భ్రాతృసతీమణినూరడించెఁదాన్ 20
క॥ ఈకరణిఁదిగుల్చేత,బ్రభాకరతనయుండునుండ ♦ స్వసచివులెంతే
నీకరణిరాజులేక,ప్రభాకరతనయ!నిలువంగ ♦ వచ్చునెయంచున్ 21
క॥ పూజ్యంబగుతద్వానర రాజ్యంబునకర్కజుండ ♦ రాజనితత్సా
మ్రాజ్యంబునొసగిరర్మిలినో జ్యాధరతనయ!వార♦లొప్పగనెంతే 22
ఉ॥ ఇక్కడ నర్కనందనుఁడు ♦ నీవహినుండఁగఁ; దానవేంద్రుతో
నక్కడనబ్బలారిసుతు ♦ డవ్వహినస్త్ర సుశస్త్రపాళుల
య్యొక్కుఁడు ప్రసర్పోవ్వజము ♦ లెంతయుగైకొని సక్రమంబుగా
నొక్కఁడుపోరిపోరియని ♦ యొక్కఁడులేమిమహాగ్రహంబునన్ 23
శా॥ ముష్టాముష్టిని, నాముటేనుగుల పో ♦ ల్పుందీటి, పంచాస్యవి
స్పష్టాహంకృతిఁబోర, శక్రసుతుభా ♦ స్వన్ముష్టిఘాతమ్ములన్
భ్రష్టంబైసకలాంగకంబు లలస ♦ ద్రక్తంబులంగ్రక్కఁగాఁ
బిష్టంబుంబలెనయ్యె వాసిమెయిదో ♦ ర్వీర్యంబడంగన్వాసన్ 24

ఉ॥ ఆపయి రాక్షసేంద్రు బల • మంత యడంగుటెఱింగి పొంగి, తా
రాపతి వాలి, దైత్యుని స్వ • రత్నసహానసువక్షమందు బెం
గోపము గోస్వముష్టినటు • గ్రుమ్మఁగ, ముక్కులనోరవీనులం
బాపపుసోకునల్లనాఁగి • మాటికిఁ గక్కుచుఁ బీడఁ బ్రాణముల్ 25

తే॥ కులిశహతి నేలఁగూలిన • కొండవోలెఁ
మఘవను తుముష్టిఘాతంబు • మయుసుతు నెద
దాకినూనెఁగొండ బ్ర • ద్దలయి ఘూర్ణి
లెను మృగమ్ములు భీతిచే • తనుదొలంగ 26

ఉత్సాహము॥ అశరేంద్రుడిట్లడఁగ • నతని చుట్టలెల్లతా
రేశుఁజుట్టుముట్ట,నగ్ని • నేచిచుట్టుమిడుతల
ట్లాలదరు బ్రమోత; వారి • నట్టెయొక్కరొక్కరిం
గీశభర్తదుంతగాతు • గీముజేర్చెనుక్కునన్. 27

ఉత్సాహము. రాక్షసేంద్రువానిబంధు • రాజియుద్ధమంనుగీ
శక్షపాకరుండునిట్లు • జావమొత్తివేడ్కమై
నాక్షణంబునందతగ్డు • హోముఖమ్ముఁజేరహ
ర్యక్షువిక్రముండునక్క • బ్రక్కనిల్వకుండియున్ 28

పంచచామరము. గుహాముఖంబునందుదొడ్డ • కొండఁగ్రక్కినట్లు త
న్మహాబలుండెరిఁగివాని, • మాటికక్కి! యక్కజా!
సహాయమేగుదెంచిరివ్రు • చాలనిల్చియుందుని
ర్వహింన్మెఱఁగితేలనయ్యె • పల్కకేనుబిల్వఁగన్. 29

క॥ అనియనచియరచిగుహావా। తను గ్రుక్కినకొండగాళ్ళ • దాచికినుక ద
మ్మునిదూడుమ, వాసవనం, దనుడరి కాపురీనగంబునకుశర్వాణీ ॥ 30

(వాలి మాయావిఖండించి పురంబుజేరుట)

వ. ఇట్లు పురంబుజేరి పట్టాభిషిక్తుండు, సింహాసనాసీనుండు, మంత్రిపురోహితాచార్య బంధుజన పరివృతుండునగు నక్కనందను జరచురంజూచి ప్రళయసమయసముజ్జృంభిత దావపావకుండునుంబోలె, మండిపడుచు, గట తటముల్దరఁగ నినికలనిప్పుకలుప్పతిల్లఁ గ్రోధాంధకార మగ్నమానసుండై, పలుగురాలం దిరగలింబోస్త్రిప్పినచొప్పున బండ్లుగొఱుకుచునభా

జనంబుల నెట్టికొనిపోయి పటాపించి యిట్లనియె. 31

శా॥ ఓరీ వృత్తచరాధమా! కపులు లేరో! వెంటవారో! ముదా
జ్ఞారీతిం జరియింపరో! మదమువంజండాల! నీపోల్కి వా
శేరీ యిట్లొనరించిరే; యహహా నిన్నేమందురా! తమ్ముఁడం
చేరీతిం నినుబల్కరింపదగు నిస్సీ యెంత కేకజాలుఁడా॥ 32

భుజంగప్రయాతము- కులద్రోహి! నన్నింతకుం దండ్రిముం చెం
ఖలాత్ముండవం చెంచఁ కన్యావ్వరాజ్యం
పులస్త్యార్భవద్బాహువుం జేర్చి; దుర్గం
బులం గ్రోల్ హరిద్వేడఁ ముం గ్రక్కుకున్నే 33

క॥ ఉన్నాఁడవు మత్పురమున మన్నాఁడవు నేను బెంపఁ మమువలసుకముల్
గన్నాఁడవు నాద్రవ్యము దిన్నాఁడవు నిట్టిడవుటఁ దెలియఁగనైతిఁ॥ 34

చ॥ హరిహరి నిన్ను తమ్ముఁడవఁటంచు గుహాముఖమందు నిల్పినే।
నరిగిననమ్మి యెంతపనిఁ జైమెన నొనర్చితి హాంతకారి! నే।
నరగునవత్తునంచు నొకఁ శైలము తద్గుహ వాతనూకితే।
పరమకిరాత! చూడుము భవన్మదమార్పక యున్న వాలి నే॥ 35

వ. అని మహాగ్రహంబున నౌరందరి వలుకుచున్న నంతకు మున్న
నర్కజుండును 36

సీ॥ భక్తి మైయెదురుగాఁ బరతెంచి సాష్టాంగదండప్రణామంబుఁ దగ నొనర్చి
మాపుణ్యవశమునఁ నాపుణ్యజనుని మాయావి ద్రుంగించి తేఁ యార్చి పేర్చి
దిక్కుమాలిన కీశఁ దేశంబునకు మాకు; దిక్కుఁ వచ్చితేఁ దితిజనోర్చి
తెలిపట్టు గొదుగు భక్తి నిబట్టెదనుగొమ్ము; కదక మ్మెనీదు ప్రక్కందలిర్చి
తే॥ మంత్రులే గొల్వ నిల్వము మహిమ జేర్చి।
అబలలం గేళి దేలుశఁ య్యారునుదార్చి।
మఱియు నీతి నిబల్కుము మమ్ముఁ గూర్చి।
ద్రుంచి వచ్చితి గాదెఁ శత్రువు నదిర్చి॥ 37

సీ॥ మాయన్న యీవన్నె మాటచొప్పున నొక్క;
వత్సరంబుండితిఁ బర్వతగుహ।
నుండునట్లుండఁగాఁ బాలసుదిండుల కేక;

లంతంత జెవివిన నత్యో, నీదు।
పలుకులొక్కటియువిన బడక పోవుటకాక।
న్నత్తు కురులు గుహనిండ బాఱె।
పిమ్మటమది జెయు బెట్టి త్రిప్పినలాగు।
నుండె నేమని పల్కుదుక్కఱియపు॥
తె॥ డసురవచ్చునటంచుగు హాముఖమున।
గ్రుక్కియొకకొండ గ్రుడ్డసి గ్రుక్కికొంచు।
వచ్చునను దేర్చువారలేమి వచ్చుదుఃఖ।
మప్పుడునరణ్యరోదనం బయ్యెజుమ్మ॥ 38

వ. ఇవ్విధంబున 39

క॥ పనవిపనషి కిష్కింధకు। వనటమొగంబుననే నే వచ్చినరాజ్యం।
బుననిల్పిరి, సచివాళి। కనుగొన్న నునట్టులుండే గావలెనన్నా॥ 40

సీ॥ ఈపురాజపుగమ్ము నేయువరాజుగా; నెలమిమైని ల్చెద నెప్పటట్ల।
రాజులేకున్న న రాజకమౌనని; సామ్రాజ్యమునసన్ను సచివులెలమి।
నిల్పిరి; రాజ్యము నేగోరినది కాదు; క్షమియింపుమురలరాజ్యము గ్రహింపు
స్వీకనుజుండనై నీపై ద్రోహమ్ము; నేనేలదలతును నింద్యచరిత।
గీ॥ నీపదములాన మఱియుదండ్రిపదమాన!
నీకు మొక్కెదనన్ని కనీళ్ళఘుంతో,
పాలముంతో, మదీయప్రాణంబు నీదు।
చిత్తమె ట్లైనగాని యోజిష్ణుతనయ॥ 41

వ. అనిపాదపద్మంబుల వ్రాలినసూర్యపుత్రునవల ద్రోచిపదరియదరిపడి లేచి

ఉ॥ అంతటమంత్రిసత్తముల నైంద్రిగనుంగొని మంత్రులార! నీ।
హ్యంతకు డెంతకై సదగు నందరెఱింగిన దేక దాక్ష్యపా।
వంతుమనేయునే ఖుటుల భ్రాతున, కీకుటిలాత్మునిర్దయుణ।
మంత్రియుతంబుగానిపుడ మత్పురము న్వెడలంగ ద్రోబ్బుడీ॥ 43

(వాలి, మంత్రియుతముగాఁ దమ్ముని వెళ్ళదరుముట)

క॥ ఁనిమంత్రియుతముగా, తమ్మునిబురి వెడలంగనూకి పోకంతటన।

య్యనఘ! జతురబ్ధివలయిత। ఘనభూమండలము ద్రిప్పెం గనికరమరగాన్ ॥

ఉ॥ త్రిప్పిన గ్రంజరీసుతుడుం దీవ్రమదమ్మున నిట్టు పల్కె, నే।
జెప్పెద, లెస్స కుత్తుకవం జీరుడ! విన్ము ల ఋశ్యమూకమున్
దిప్పకు వారి వ్రోడుతనుం «దిట్టుటచేత,» «మతంగవాని» నే।
జెప్పెడి దేఖి, దేవరయుం జిత్తమునందలపోయగాదగున్. 45

(సుగ్రీవుండు ఋశ్యమూకముం జేరుట).

క॥ అనిపల్కి తిరిగి గ్రక్కున। వెనుకకుజని ఋశ్యమూకం పృథివీధ్రంబుం।
గని మంత్రిజనముతో నట। బనుపడ సుగ్రీవుండుండె భయరహితుండై ॥

వ. అనిన విని వినయపూర్వకంబుగం గుండలికుండలునకు గొండరాచూలి యిట్లనియె 47

క॥ నాథా హనుమంతుండతి। మేధానిధి, విక్రమమునం దమృగరాణ్ణిభుడున్
వేధాభుడాగమార్థ్య। క్రోధాత్ముండేకపాదరుద్రుండంచున్। 48

శా॥ మీరేపల్కితిరొక్కనాడు సిటులీ మిత్రాత్మజున్ వాలిబల్।
గాటింపం దనలావు జూపక, సమాఘాటోంత్రమైనుండెడుం।
భూరిబ్రాహ్మణశాపమేచం దసలాం పుందా వెరుంగండొ వా।
డీకీతిం జనుభంగి చూడగతమో యాశాపమెరింగింపవే ॥ 49

ఉ॥ నాప్రభు శంభుడిట్లనువి నాయకమాతకు దేవి! తల్లస।
ద్భావుడు, నైంద్రినర్కినతి భక్తి సమానముగాగ గొల్చెమున్।
గావున నిర్వ్యరంచు నెటి గల్గినవాడవుటం గపీంద్రుమై।
లావుము గల్గియుందన బలంబును జూపకయుండెనెంత యోన్. 50

క॥ ఈలీలదమ్ము ఋండగ। వాలిమతంగమునిశాపభయమునన టువో।
జాలకలావతీసిలిచె, బ। లాళియుబోకుండెను; నిట్టులరిగెదివంబుల్ ॥51

వ. ఏతత్సమయంబున. 52

(పూర్వరామాయణకథాసంగ్రహము.)

మ॥ సరయూతీరధరిత్రిభర్మవిధుపాంషాణాభినిర్మాణ బం।
ధురసౌధాంతరఖేలనాపర, వధూం స్తోమామలాకార సుం।
దర సంవీక్షితలబ్ధహీసహితకాంతారత్నసంతానభా।
సురగీర్వాణనికేతనంబగుచుండాం శోభిల్ల సాకేతమున్। 53

క॥ అవ్విధరెణు,సొబగుల। పువ్విలుతుఁడుసమదశత్రు• భుజబలహారణుం।
డవ్వనజాప్తకులీనుఁడు। నెవ్వడిగలదశరథుండు• నెగడువిభూతిన్ ॥54

ఆ॥ సంతతమ్ముబంధుసంతానమునకుసం; తానభూజమట్లుతాదలిర్చి।
ఇలను బెద్దకాలమేలిసంతానేచ్ఛ; శిష్టులాన• నిష్టిసేయునపుడు ॥ 55

ఉ॥ వేలుపుఱేఁడులోనయిన• వేలుపులెల్లను,లంకనేలు తో ।
ల్వేలుపుఱేఁడు, లోకములవేల్పుల బెట్టినబాధఁ దెల్పి తో
ల్వేలుపుఱేఁడ ! మమ్మిపుడుబ్రీతినిమన్నుమటన్న బుల్గడాల్ ।
వేలుపుఱేఁడటంబనిచి- వేల్పులవానినడంచు నిచ్చలోన్ । 56

వ. నేతదిష్టినగ్నిపురుషుండొసంగిన పాయసంబున లీనంబయిదాని దశరథుండంగనలకిడవారుగర్భంబులదాల్చి సుపుత్రులంగనిరి. వేలుపులవానరబలంబులుగా బుట్టనంతకుమున్న నేమించినాడుగావున. 57

సీ॥ సరయూతటమ్మునజరియింపగానెంచి•విరజాతటమ్ముపై వేడ్కమాని।
సాకేతపురమునజోకనిల్వదలంచి• వైకుంఠపురముపై బాళిమాని ।
తోడబుట్టినటింపజూడగామదినెంచి•శయ్యాయుధములదాల్పంగమాని
ఝష్మకన్యకాకేళిజాలదేలదలంచి•జలధికన్యకతోడి చెలుపుమాని ॥
గీ॥వనచరులగావనెంచిదేవతలవీడి।మర్త్యతనుడింపనెంచియమర్త్యతవిడి।
అరిదశేషాసనందకా•ద్యాయుధాభి।రాముడయ్యెడదశరథరాముడయ్యె

చ॥ హిమగిరిరాజకన్యపతియించెకుమంత్రము• భారతీసతీ।
రమణునిగన్న వేల్పు వల•రాపగవానెదత్తమిమ్మి తేటి, వే।
దమయుఁడు, గల్మితోయ్యలిము•దమ్మున నోచిననోముపంట దై ।
త్యమదవిభేది కోసలసుతాప్రియపుత్రకుడై ప్రవర్ధిలెన్ ॥ 59

వ. ఇవ్విధమ్మున శ్రీమన్నారాయణ పరబ్రహ్మాంశంబున కౌసల్యాగర్భశుక్తిముక్తారత్నంబునాబుట్టి రాముండు తచ్ఛయ్యాయుధాంశంబులకై కేయీసుమిత్రలకు జన్మించిన భరత లక్ష్మణ శత్రుఘ్నులంగూడి, తల్లులకుం దండ్రికిం గరమ్ముముద్దుగొల్పుచు బాలకళానిధివడువునం బెరుగుచున్నంత. 60

క॥ కౌశికసహోదరుండల । కౌశికసంపూజితాంఘ్రి•కమలుండంహః ।
కౌశికదివాకరుండగు । కౌశికమునివచ్చెనొక్క•కాలంబందున్ ॥ 61

చ॥ భవనము జేరవచ్చు మునిఁ బఙ్క్తిరథుండొగిఁ దోడి తెచ్చి మా ।
భవనము చెందెఁ బావనత; వచ్చిన కార్యము దెల్పుడన్న నా ।
సవనముఁ గావ నీ మహిత సంతతి బంపుమటన్న తేఁడు నా ।
సవనము గావ బంపఁగ వెసఁ జని, రారఘురామలక్ష్మణుల్ ॥ 62

క॥ ముని వెంట జనుచు రాముఁడు ।
దునుమాడెం దాటకాఖ్యం దోయజనేత్రిన్ ।
దునిమెను బాహుని వెండియు ।
వననిధిలోఁ మాటిచె వానిఁ భ్రాతను గడిమిన్ ॥ 63

క॥ జన్నము మునిపీఁచిన । బన్నము గలిగించె మా కటంచు నమరులుం ।
బన్నము ను బాపిమా బా । బన్నము చేద్వేషి నెనయు నతివ నరయుబో ॥

చ॥ అనిమునలాడ నీపగిదిఁ నయ్యమివర్యునితోడ వారునా ।
జనకుని పట్టణంబునకుఁ సంభ్రమతం జనుచుండి మధ్య దీ ।
రనితమి బాదరేణువునఁ రాతిని నాతిగఁ జేసి గౌతమాం ।
గననుతి సల్ప్ర ముక్క జెలిఁ గాంతుని జేరగ నంపియాదటన్ ॥ 65

వ. ఇట్లు విశ్వామిత్రునితో రామలక్ష్మణులు జనకాగారంబునకుం జనిరంత.

సీ॥ ఆత్మసుహృద్ధర్మ మణగించ మా రాము
హృదయ మొప్పెనయంచుఁ నీశ్వరియన ।
నెవరిధర్మము వారఁ లెసగింప నాదిదం
పతులోర్చ లేరనిఁ రతియు ననఁగ ।
మద్భర్త శివుని విల్ ముడగించు చప్పుడె
ప్పుడు వినుదునంచు భూపుత్రియనఁగ ।
నెఱినాఁటి తండు బెండ్లి కొమారు డైన శ్రీ
జనకుఁ బోలనయంచుఁ జనకుడనఁగ ।

తేగీ॥ నీధనుర్దళనం బేరిఁ గెరులఁగఁ జేసి ।
పోరు పొసగింతు ననిఁ దివ్యబువ్వతపసి ।
బయుల బాలరలాడగాఁ బంతి తేర్ల ।
జేనితో లిచూలు శివుని విల్ విఱిచి చెలగె ॥ 67

క॥ జనకుండంతట రాముని జనకుని రానించి విశ్వామిత్ర • జనకరంబుగ శ్రీ
జనకుండు శంబరాంతక జనకున కయ్యెండి రావి • శాలాక్షి వరెన్॥ 68

క॥ కమలాయతాక్షి సీతాం బమహా వైభవముతో "నిం • మాం కన్యాం తు
భ్యమహాం సంప్రదదే" యని క్రమతం బాధారవోసె • రాముని కెలమిన్

ఉ॥ ముద్దుకొమార్తె కర్మిలిని • ముత్తెపుబొత్తుల, జీని చేలలం
బుద్దుల వెన్నో చెప్పియిడి • భూపకుమారుఁడు రాముతోడఁబల్
ముద్దులమూటగట్టునొక • పుత్తడి తేరున నెక్కఁజేసి యా
ప్రొద్దుకొలంపుఁజందురుని • బుచ్చెను తన్మిథిలేశుఁడెంత యేన్॥ 70

వ॥ ఇట్లు సబహుమానంబుగా జనకుడంపం జనిరంత. 71

క॥ శ్రీకరుఁడగు రఘురాముఁడు జోకరహింజను చునడుమ • శ్రుతిపారగురా
డ్భీకరుని జామదగ్నిగు ణాకరు గర్వంబడంచి • యరిగెం బురికిన్॥ 72

చం॥ పురమున కేగి పఙ్క్తిరథ • భూరమణాజ్ఞఁ దలంధరించి సా
దరమున ముద్దుతమ్ముఁడును • ధారుణినందన కూడ రాగ స
త్వరమున రామచంద్రవసు • ధారమణుం డు వనమ్ముఁ జేరె నా
పురమున నెల్లవారుగను • వొక్కుచు వృద్ధమహీశుదూరగాన్ 73

వ॥ ఇట్లు జాయానుజోపేతుండై చనిచని 74

క॥ ముంగలగాంచెను రాముఁడ భంగతరంగానుషంగ • వాత్తురగంబున్
రంగదపాంగంబాకజ సంగతభృంగన్మహేశ • సంగంగంగన్॥ 75

వ॥ కని గుహుండను కిరాతపతి సహాయంబున సేతన్నదీలలా
మంబునుత్తరించి, చిత్రకూటంబు దాటి, దండకా
రణ్యముం బ్రవేశించి జాయానుజోపేతంబుగ నున్నంత॥ 76

క॥ నెరవాడిగోళ్ల రక్కసి ఖరనాసాశ్రవణ యుగ్మ • కముగోసి వెనన్
ఖరదూషణాద్యసురసంహారణంబానరించి రామ • మహీపతి నిలువన్ 77

తే॥ చాలు పేరింటి పూబోఁడి • చక్కదనము
శూర్పనఖ వర్ణనము సేయఁ • జొక్కి రాక్ష
సేంద్రుఁడును బాహువన్న స్వర్ణమృగము నె
నర్చి పంపించె సీత సం • తసపడంగ॥ 78

పంచచామరము. మృడానిభర్తకేలదాల్చు • నేణపోతమెన్నన
క్కడాని లేడిఁ దెమ్మటంచుఁ • గాంతవల్క నెందునే
న్గడాని లేడిఁ జూడమంచ • నంగదోడువిన్కన
ప్పుడానిలింపులెన్న లేడి • పొంతనేగె రాముఁడున్॥ 79

క॥ సారంగము నేలియునీ సారంగము నేయుబట్టు • చాలనిశిప్రుకై
సారంగముగుందఁగఁద త్సారంగముగూల్చె రామ • చంద్రుఁడుగడిమిన్॥

చ॥ మృగమును ద్రుంచి వన్యమృగ • బృందముదన్గని పాఱ రాముఁడా
జగములతల్లి నిన్వెడచి • చయ్యనవచ్చుసుమిత్రసూతిఁ జె
ట్లగములఁ గాంచికుందుచుని • లాతనయామణినోలిబాళి ద
న్నగములఁ జెట్లనారసి మ • నమ్మునఁ జింతిలుచిర్వురున్వనన్॥ 81

క॥ రోయుచు సీతమవార్తజ టాయువెఱింగింపగా నెం • డందనలరుచుం
డాఁకుకబంధునికరముల । వేయుచునసిధారశబరి • విందొగిగొంచున్

క॥ రంపులురొంపులు లేకని లింపులనది పెంపునంజ • లింపుచుఁ దమ్మిల్
కంపులతుంపరలందగ పెంపులడంపునలపంపఁ • బ్రేముడిఁ గసిరా॥ 83

క॥ కసితద్విమలోదకములఁ గొనితడవకు దాని పెంపు • గొనియాడుచు,ద
ద్వసితరుచయంపునీడలజనితపథశ్రమలడపుచు • జరియించు నెడన్ 84

(సుగ్రీవుఁడు రామలక్ష్మణులంగాంచి భీతిల్లుట)

సీ॥ శ్రీకరరుచిమనోజ్ఞాకారములవారి గర్ణాంతదీర్ఘాంబ • కములవారిఁ
జటులపోలికజుట్టు • జడలచుట్టలవారిఁ గమనీయమైనవి • క్రమమువారి
వీఁకమైమోఁకాలుఁదాఁకు • చేతులవారిఁ బలువిండ్లమూపుల • బరగువారిఁ
బొలుపారురాచకో • వులఁ జెలంగెడువారిఁ గావిధట్టులబిట్టు • గ్రాలువారిఁ
గంబుసుందరమంగళ • గళమువారి
డంబుమైగుల్కు విప్పాటు • రంబువారి
నద్యగణనీయశుభలక్ష • ణములవారి
రామలక్ష్మణులంగాంచె • రవిజుఁడపుడు 85

మ॥ కనిభీతుండయినల్లగుండెనలుద్రవ • క్కల్ గాగనిప్రవ్యద్రో
క్కనచందంబునఁ దత్తరాననొకచ • క్కంబాద మొక్కంత సే

పునుపంజాలక దేపకయ్యనఘులం • బ్రోద్యద్ఘనాకారులం
గనుచున్నోమునవిన్న వాటొదవజో • కఁ గల్గోనదర్శించుదాఁ 86

మ॥ మునివేషంబులదాల్చినారు, విలున • మ్ముల్ బూనినా, రుగ్రభం
గినిగాన్పించుచునున్న వారు, ననుర • క్షింపదిర్వుచున్నారు,న
న్ననిగెల్వంబురుహాతనూతిమునిరా • డాకారముల్ తోడ,బం
పనికే తెంచిరివీరు కాకశరచా • పంబుల్ మునుల్ దాల్తురో! 87

మ॥ మొకముల్ జేర్పరిలంగనీకపులుసం • క్షోభంబునన్నారెవ్వ
తుకదంబంబులఁదూర్ణచంక్రమణముల్ • సాగింపుచున్నారుసా
కొకలాగున్న దినెమ్మనంబునికనే • నుండంగరాదిందటం
చోకఁడేయోచననేగ, బావనియున • చ్చోఁజొచ్చియుందిట్లనున్ 88

ఉ॥ ఏటికివానరేంద్ర! మొగ • మేదియొకాంతివోఁ బంగియున్న,దీ
వేటికిభీతవృత్తినటి • యుంచెదువానికిబోలెఁదోఁచె,దిం
దేటికిభీతిశక్రసుతుఁ • డేనితదాశ్రితులేనిరారు,ని
చ్చోటికివేరొకంటమను • జుండరుదెంచిమనంగనేర్చునే 89

ఆ॥ అన్నవిన్నఁదనమునాన • నమ్మునదోప
నక్కవల్కునిట్లు • లాంజనేయు
తోడ,గనుమువత్స! • దోర్బలశాలురు
నిరువురుసరసిదరి • దిరుగుచురదె 90

ఉ॥ అందనవద్యులన్నురశ • రాసనహస్తులవారిఁగన్ననా
కందినగాయయెంతయువ • కావకలైచనెనేమిచెప్ప సం
క్రందననందనుండనుప • గా మునివేషములూనివచ్చినా
రిందనకద్దికావనిన • నేటికివారికవిందులనమ్ములున్ 91

ఉ॥ ఐననుభిక్షురూపమున నమ్మహనీయులచెంతకేగి,నీ
వైనవచశ్చమత్కృతిని • నామహిమాధ్యులరాకకుంగతం
బైననెఱింగిరమ్ముమన • మావలకార్యముజూచికొంద మ
లైనమనంబులోని దుడు • కాగుననాకుఁగపీంద్ర! వెండియున్ 92

ఉ॥ అక్కడివాలివంపనిట • కామహనీయులురారయెన్ని,వా

రెక్కడినుండివచ్చిరొ, మ • ఱెక్కడికేఁగఁదలఁచిరో కా, ని
ట్లిక్కడిభూములారయఁగ • నేలొకొ నీవిదియెల్లదెల్పవే
ఇక్కడికట్టిరావలెన • హీనజవమ్మునఁ నంచుఁ బంపెఁదాన్ 93

వ. ఇట్లు పుచ్చినంజవంబున నేగి

(హనుమంతుఁడు భిక్షురూపమున రామలక్ష్మణులం జేరఁబోవుట)

క॥ ఘనకపిరూపమునూడిచి, వినయముమీరంగ భిక్షు • వేషంబునన
య్యనఘులపాలికరిగి భ, క్తినమస్కారంబుజల్పి • కేల్మోడ్చి వెసన్

తే॥ మంజుసామ్యామాలోక్తుల • నాంజనేయుఁ
డిచ్చమచ్చికనచ్చఁగ • ముచ్చటించి
యామహాత్ములకిట్లను • నాత్మమతము,
నర్కసూనునిమతమును • నచ్చపడఁగ 95

సీ॥ శ్రీకరులార! సం • భృతశరాసనులార! మీరెవ్వరిట కేమి • కారణమున
చనుదెంచినారు రా • జర్షిదైవతతుల్యులరు, మునిరాడ్వేషు • లరు వ్రతులరు
క్రోధహీనులరు ధీ • రులరు ప్రావృణ్ణీలమేఘభర్మాభ మా • మేనులరు, శు
భాకరులరు, జగ • దారాధ్యులరు, మనోజ్ఞాకారులరు సద్గు • ణాకరులరు
సరసపంపామహత్సర • స్తటము హెబార్వి
నురుతరాతురతవెదకు • చున్నవారు
తమ్ముఁగనుఁగొనిపక్షిసం • తతులువాఱు
దేహకాంతివృతమ్ములు • దీప్తిమీర 96

ఆ॥ దివినిఁదిరిగితిరిగి • దివిపీడి క్షితిఁ బ్రీతి, సంచరణముగడక • జల్పవలయు
నంచువచ్చినట్టి • హరిణాంకమార్తాండు, లంచునెంచువాఁడ • నాత్మలోన

ఉ॥ భూరిసువర్ణరత్నమయ • భూషణబంధురతారహారవి
స్తారసువర్ణవస్త్రహారి • చందనధారణయోగ్యభవ్యశా
రీరమునారచీరలధ • రింపఁగనక్కటమీరలీసర
స్త్రీరపుఁజెట్లఁ బెంబొదలఁ • దిర్వెదరేలొకొ నాకుఁ బల్కరే? 98

క॥ పరమేశశరశరాసన, శరధులకెనయైనతీక్ష్ణ • శరధనురిషుధుల్
శరములమూపులఁదాలిచి, పరముని వేషములదిరుగు • వారెవ్వారో

సీ॥ ఏనెన్ని వితములఁ • నెచ్చరించిన మీరు బల్కు రాత్మచరిత్రఁ • బల్కువాఁడ
వినుఁడయ్య! సుగ్రీవుఁ • డనువనచరపతి భ్రాతృవంచన చేతఁ • బడలి, నాఁడ
కడకనీ ఋశ్యమూ • కమునకు మంత్రిసంయుక్తుఁడై వచ్చినెం • మ్మోమ్ముగ్రీడ
గూడనిల్చిభవద • కుంఠితస్నేహమ్ముఁ జేయనన్నిటకన్పుఁ • జేసినాఁడ
నతనికర్మిలిఁ బెగ్గడ • నైనవాఁడ
వాయుపుత్రుండనంగనే • వరలినాఁడ
కామరూపసంచారతఁ • గ్రాలినాఁడ
బరగహనుమంతుఁడనుపేర • బరగినాఁడ 100

తే॥ సూరపుత్రునిహితమునే • గోరిభిక్షువేషమునవచ్చినాఁడనో • వీరవర్యు
లారయనిహనుమంతుండు • నూరకున్న రాముఁడాత్మనలరిసుమి • త్రజునిక
(నియె)101

క॥ వారిజబాంధవ • తనయుని, కూరిమిఁ బెగ్గడయపీడ్ల • గుం, దమ్ముఁడ! యి
ష్టేరికయిమనము • నివ్వసిఁ జేరితిమో వారెమనలఁ • జేరిరికంటే 102

సీ॥ ఒప్పుగా మెప్పుగా • నిప్పుడీకపిచంద్రుఁ • డనునీవు బలివచ • నమ్ము నిమ్ము
చతురాగమమ్ములు • చతురతఁ బఠియింప లేనివాఁడిటు వల్కు • లేదు నమ్ము
సర్వశాస్త్రమ్ములు • సర్వమంత్రంబులు, నీతం డెఱింగిన • దేనిజమ్ము
మఁల్లోకములఁగల్గు • నెల్లవ్యాకరణముఁల్ తమ్ముఁడా! యీతని • సొమ్ము సు
(మ్ము)
సంస్కృతమునవీని • సాటిముల్లోకమ్ము
లందొకండులేడు • లక్షణమ్ము
నందుఁగూడమిన్న • యన్ననీవేలాగు
నిత్తువితనికెన్న • నుత్తరమ్ము 103

క॥ కౌతుకవిలంబితంబూ, కృతము, నబద్ధమ్ము తొస్సు • లెటలేక, విచా
రతనిడనిమధ్యమస్వర యుతసంస్కృత వాగమృతము • లోఁగిఁ జెవినిడఁడే

తే॥ తమ్ముఁడా! వీనివాగమృ • తమ్ము జెవినిఁ గ్రమ్మనేపాటి ఘనపాప • కర్ముఁడేని
తన్ను జంపంగఁ గత్తి నె • త్తంగనిమ్ము; కృపనుగావండె ఘనతర • ధృతిఁ దనర్చి

క॥ ఈదృశసచివవరేణ్యుని; సాదరమునఁ జేరబట్టి • నట్టినృపతిపై

వాదమున కెట్టిమాత్రురు రాదివురరు వచ్చి రేని ♦ రాలకచన రా

వ. మఱియు నిట్లనేక విధమ్ముల హనుమంతు రాముండు బ్రశంసించి
పలికిన. 107

(ఆత్మచరిత్ర లక్ష్మణుఁ డాంజనేయుతో ముచ్చటించుట)

శా॥ ప్రాజ్ఞుం డైనసుమిత్రసూతి వలుకుం; ♦ బ్రాజ్ఞుం బ్రశంసార్హు గా
వ్యజ్ఞుం, బండితవర్యుఁ గాంజరిసుతుం ♦ గన్నారవీక్షించి, స
ర్వజ్ఞా! త్వత్ప్రభుశౌర్యధైర్యములను ♦ ప్పన్వించుమే మాకబం
ధాజ్ఞారీతిని వచ్చినారము జుమీ ♦ హార్షంబు దైవార్థగా॥ 108

క॥ మఱియు భవత్ప్రభు వాక్యము తెఱఁగున జెప్పెదమటన్న తెమ్మెరముద్దుం
జొఱయు నెద నలరియాలె, స్సఱితిగలా నిజయమెడద ♦ నలరఁదలఁచుచుఁ॥

క॥ జగములనే లంగాఁదగు, జగ జెట్టులె ప్రొద్దుపట్టి ♦ సఖ్యం బెదన
చ్చుగఁ గోరివచ్చి నారట; జగముకనుకొమారు చేత ♦ సాగకయున్నె

వ. అనితలంచి కేసరికిశోరంబు, సుమిత్రాత్మజుం గాంచి, దేవా! భవద
గ్రజుంపు, మీరు, నీపంపాతటంబున నేలగ్రుమ్మరవలసి వచ్చెనని పలికి
న హనుమంతునకు లక్ష్మణుం డిట్లనియె. 111

సీ॥ ధృతిమంతుఁ డర్యమ ♦ ద్యుతిమంతుఁ డ
క్షీణధారణావంతుండు ♦ దశరథుండు
ధర్మవంతుం డరి ♦ ధర్మహంతుండు
స్వధర్మపారీణుండు ♦ దశరథుండు
శౌర్యవంతుండు, బల ♦ వీర్యవంతుండు,
సౌందార్యవంతుండు శ్రీ ♦ దశరథుండు
భాగ్యవంతుండు, స్థా ♦ భాగ్యవంతుం,
డసదృశబలాఢ్యుండు శ్రీ ♦ దశరథుండు
నట్టిదశరథునకు నీతఁ ♦ డగ్రసుతుఁడు
రామనాముండు వినుతప ♦ రాక్రముండు
భూతసంతాపహారుండు ♦ భూతహితుఁడు
జనకవాక్యపరుఁడు ♦ జననుతుఁ డతండు 112

క॥ ఈలక్షణవంతుసతిమ హాలక్ష్మీతుల్యసీత • మాంబయసుమిత్రా
  నే,లక్ష్మణాఖ్యుఁడిఁ సుయశోలక్ష్మీవంత!సర్వ • శుభగుణవంతా
వ, అనిమఱియు నిట్లనియె. 114
ఉ॥ కాశ్యపిఁగోలుపోయిఁయల • కాశ్యపినందన,నేను,గూడరాఁ
  గాశ్యపినాథుఁడీవిపిన • కాశ్యపికింజనుదెంచి,యిందు ద
  త్కాశ్యపిజాత,నేఁగొలువఁ • గారహిఁనుండిన నొక్కనాఁడు, ద
  త్కాశ్యపిజఁ హరించెనొక • దైత్యుఁడు,నన్నయునేను లేనిచోఁ
ఉ॥ ఉర్వరనందన న్వెదకు • చుండనొకానొకచోటమాకుగం
  ధర్వుడొకండుశాపమున • దానవరూపముదాల్చిపిల్చి, తె
  ల్పుర్వరకన్యజాడనల • యుగ్రకరాత్మజుడంచుబల్కి,స్వః
  పూర్వరమేగవచ్చితిమి • ప్రొద్దుకొమారుఁడ, మాకుదిక్కుఁగఁ
ఉ॥ లోకశరణ్యుడుం,ద్రిదశ • లోకశరణ్యుఁడు,సద్యశుండు,ద
  ల్లోకదృగన్వవాయనృప • లోకములందఱలోన మేటి, ము
  ల్లోకము లేలువాఁడుశ్రిత • లోకవిచారుఁడు, రాఘువుండు,సీ
  తాకమలాయతాక్షికయి • ధామనిధిప్రియసూతిఁ జేరెదాఁ 117
క॥ ఎవర్ణనీయువీక్షణ, మావంతజగమ్ములందు • నలమఁగజగముల్
  దావర్థిల్లునొయతఁడి, చ్చోవచ్చిరవిజునిశరణు • జొచ్చెనుజుమ్మీ
క॥ శ్రీరమణీమణిముఖసర;సీరుహ మధుపానమునను• జెందకఁతృప్తిఁ
  ధీర మునిహృత్కమలమధు;వారంగొనుకప్పు దేటి•యర్కజు జేరెఁ
చ॥ అనవిని వాయునందనుఁడు • హంసకులాభరణమ్ముగాంచిసం
  తననను లక్ష్మణా!దివిజ • నాయకసూతికిబుద్ధి,నంగనా
  జనములసంపదల్ గొనివె • సందరుమంగభవత్సమీపముం
  గొనకొనిచేరెనర్కజుఁడు • కుంతితప్రేమలగాంచిరే రహిఁ 120
(హనుమంతుఁడు రామలక్ష్మణుల సర్కజునొద్దఁ జేర్చుట)
క॥ అనిరామచంద్రునకుమ్రొక్కి-నిలచిశ్రీరామచంద్ర • కీశపతిని జే
  ర్మినిఁగనజను దెండీయన, వినిలక్ష్మణుఁడనియెరామ•విభునకుభక్తిఁ
శా॥ అన్నా!విన్నపమాలకింపు,మితఁడ • త్యాసక్తిఁ భాషింపుచో

నన్నుం దాననముందు, నెమ్మది బ్రస • న్నత్వంబెకొన్పించు, నెం
దెన్న న్మోసముదోపదింత, యటులా • టేగంగ స్వామీనితో
నన్నన్వాల్లెయటంచు రాఘవుఁడు నె • య్యంబారఁగాఁబల్కినన్
క॥ ఆపయిఁ బావనిభిక్షుక, రూపమునూడ్చి కపిరాజ • రూపము నెంతే
జూపట్ట నెరసి వారిని, మూపుల పైఁ దాల్చి రవిజు • ముంగలఁ బెట్టెన్
ఉ॥ పెట్టికరమ్ము బట్టియను • ప్రేముడి, నోరవిపట్టి! యీజగా
జెట్టియు బాంతి తేర్గుగల • జెట్టికి దొల్తటిపట్టి, రాము, డి
ప్పట్టున డాయవచ్చెనిను • భ్రాతసుమిత్రజుతోడ, నీవునుం
బిట్టుగఁ బూజసల్పు రఘు • వీరున క్రీయనఘుండు గండు సై 124
చ॥ జనకునియానసజ్జనక • జాతయుఁదమ్ముఁడుగూడ రాగ, ని
ప్వనమును జేరి రావణుఁడు • వారిజలోచన సీత ముచ్చిలిం
చినవన మెల్ల నార్గయుచుఁ • జేరిరినీ శరణమ్ము, నీతఁడ
వ్వనజహితాన్వయాబ్ధిహిమ • భానుఁడు జమ్మదినేశనందనా!
క॥ రాముఁడు, నిర్జితభార్గవ, రాముఁడు, మండితగుణాభి• రాముఁడు సీతా
రాముఁడు, దారుణపాపవి, రాముఁడు దైతేయమదవి• రాముఁడు సుమిత్రా
వ. అనిన వినిరవిసుతుండు, హనుమత్సందేశంబున రామలక్ష్మణులవల
ని భయంబు, దిగనాడి, హనుమద్రచిత తాళపత్రచిత్రాసనంబున, వా
రినిర్వుర సభక్తి పూర్వకంబుగఁ గూర్చుండ బెట్టి, పూజించి ప్రము
ఖ్య ప్రక్కనిల్చి యిట్లనియె. 127
క॥ ధీరులరని తతలోకా, ధారులరని విబుధగేయ • ధర్మగుణమహో
దారులరని దైత్యమదవి, దారులరని పలికె హనుమ•తగియుండెనటుల్
క॥ ఎక్కడిదశరథరాముం, డెక్కడి రవిజుండు స్నేహ• మ్మెనయఁ దనకుఁ దా
నిక్కడికి వచ్చె నటతమి, యెక్కడిదో! నాదు భాగ్య• మేమనవచ్చున్
క॥ కాకుత్స్థతిలక! నాతో, నీకుం జెలిమియొనరింప • నెఱిగలదేనిం
నాకయి బెట్టుమనీకయి, నాకయుని దెచాచినాడ•నరనుతచరితా!

[రామ సుగ్రీవులగ్ని సాక్షిగాఁ జెలిమి చేయుట]

క॥ శ్రీకరుఁడు రాముఁడాపలు, కాకర్ణించితనకేలు • ఖరకరసుతు గై

జోకనిడెబకొంసింపుచు,బ్రాకటమునగనర్కిమైత్రి • బరిరంభించె
వ. అప్పట్టుననాంజనేయుండు శుష్కంబులందెచ్చివహ్నిరగిల్చిన,దశర థాదిత్యనందనులు, నిరువంకలనిల్చి, విద్యుక్తక్రమంబున, నగ్నిహోత్రుంబూజించి మ్రొక్కి, నేస్తంబగ్నిసాక్షిగా జలిపి, యొకరొకరివా చినట్లు, గడవుగొన్నట్లు, మేనం బులకాంకురంబులు జాదుకో నిండుమ తింగాంచుచుండ, సుగ్రీవుండు, రాముంగాంచి, దేవా! నేస్తంబునీయట్టి జగత్ప్రభువు నర్మిలింగలిసి సల్పితి, నింకమనయిరువుర సుఖదుఃఖంబులు నైక్యంబుజెందె, ఘనంబట్లకదా! కార్యంబులట్లు నెరవేర్ప వలయుం గదా! యని, యిది యభావిఫలసూచకంబనినట్లు, లొక్కఫల పుష్పదళ సమాకీర్ణంబయిన శాఖిశాఖంబెరికివయిచి రామునందు గూర్చుండబెట్టి తదాజ్ఞ, దానునమ్మహీజాని నొరసికూర్చున్న హనుమంతుండు నట్లొ నర్చి లక్ష్మణుంగూర్చుండఁబెట్టి తానుగూర్చున్నంత, సూరపుత్రుండు, ఐ క్ష్వాకురథపుత్రున కిట్లనియె.

చ॥ నరవరనందనా!త్రిదశ • నాయకనందనుఁడంగనం,గపీ
శ్వరవరరాజ్యలక్ష్మని,న • వారితబల్మిహరించినన్నుద్ధ
త్పురవరమందునిల్వకయ • బొమ్మనివే వెడలంగనూక నీ
ధరవరమందునిల్చితిఁగ • దావగదాయగఁదాపరింపఁగఁ 133

తే॥ ప్రెగ్గడలునేనునుసురులు • బిగియబట్టి
వాలిదర్పంబువెన్నంటు • వచ్చియుందు
నుంటిమిభవత్కృపామృతం • బొడలజల్కి
భక్తవత్సల!కావవే • పగఱుఁదోలి 134

వ. అంత రాముఁడిట్లనియె. 135

మ॥ భయముంజెందకుమర్కనందనభవ • ద్భ్రాతఁగ ధరంగూల్చి వి
స్మయముంజెందఁగపీంద్రులెల్లనుస్వరా • జ్యంబందునిన్నిల్పెదఁ
జయముంజెందుదువేటకీవడలనీ • జాయామణింగూడె దీ
నయముంజెందుమునీవుచూచెదవుగా • న్యాయైనదోఃపాండితిఁ 136

తే॥ ఇట్లుసేయనినాఁడుమ • మ్మెలమిఁగన్న

తండ్రిపాదాబ్జములకేను • దప్పువాఁడ
జెమ్మునేనేలలక్ష్మణుఁ • డిమ్ములఁగొని
గేలిమైదునుమఁగలేఁడొ • వాలిఁగేలి 137

వ. అయ్యెడ 138

ఆ॥ వనజకనకవహ్ని • భాసురములగుసీతావనాటరాజ • దైత్యరాజ
వామనేత్రములుజ • వంబుననదియౌధ, రాఘవేంద్రపుత్రి • రమ్యగాత్రి 139

వ. అనినవిని 140

సీ॥ మన్ననఁబల్కెన • మార్తాండపుత్రుండు
రాముతోఁజగదభి • రాముతోడ
మన్మంత్రిమణిహను • మంతుండెఱింగించె
ననఘమీరటువచ్చి • నట్టిజాడఁ
తమ్ముండునీవుప • నమ్మునఁదిరుగాడ
సీతతోసుగుణస • మేతతోడ
మాయాబలమ్మున • మాసియైరావణుం
డవనిజఁగొంపోవ • నామెజాడ
తెలియకెల్లెడరోయుచో • దిటవుపీడ
వెలయునంతఁగబంధుండు • దెలుపుజాడ
నాదుపుణ్యవశతమీరు • నన్నుగూడ
నరుగుదెంచితిరడలకు • డరయువాఁడ 141

క॥ ఉండినస్వర్గపురంబున, నుండినపాతాళమునమహా • ర్ణవస్థలిపై
నుండినఁదెత్తు వనిజ కాకుండినరవిపాదమాన • యురుగుణధామా॥

ఉ॥ వేల్పులుప్రాతవేల్పులొక • పెట్టునరావణుదిక్కురాకతోల్
వేల్పులతేఁకుసీతనల • వేల్పులబోనపుటింటఁడాపనీ
క్రొల్పులులందుబెట్టనియ • కుంఠితవహ్నినిడంగనీముహా
నల్పులమంత్రులంబనుప • నాజెలిదేనముదగ్ధిసిదనా 148

[సుగ్రీవుఁడు రామునకు సీతజాడ నెఱింగించి
తదాభరణాదు లొసంగుట]

చ॥ వలువురుమంత్రులేనునొక • నాఁడిటనుండఁగనాకసమ్మునం
బలువడిబోవురావణుని • స్వర్ణసుపుష్పకమందునొక్క-తే
చెలువలమిన్నరామగుణ • సీమనతావనఁలక్ష్మణా వెతం
బిలువఁగఁబల్క-రేలయని • బిట్టుగ నేడ్వఁగఁగంటిమెంతయేన్ 144

ఉ॥ ఇప్పుడెఱింగితిన్ దశర • థేశ్వరనందన! యామెసీతగా
నప్పుడెసీతమమ్ముఁగని • యాభరణమ్ములఁజీరచెంగునం
జప్పుననుడ్చిమాకడవె • సంబడవైచినఁడాచినాడనీ
యొప్పులకుప్పవేమొకను • మోపికతోడుతఁదెత్తునావుడున్ 145

తే॥ గుండ్లన్నిఁగ్రుక్కికొంచురా • కొమరుఁడర్కి-
యేలకాలవిలంబన • మిందువదన
భూషతేవనఁదెప్పించి • పూషజుండు
నివెకనుమటంచుముందుంచ • నెసగువెతను 146

ఉ॥ వానినిగాంచిరాఘవుఁడు • వారణయానఁదలంచియట్టిహా
మానినియుంచుదుఃఖమున • మాటికినాఱటపాటనూర్చిన
వ్వానినిఱొమ్ముచెక్కఁగవ • పైనిడిపుట్టలనాగుబ్రాములెం
తేనినిటూర్పునూర్చుకర • ణిందరిదమ్ముఁడునర్కికుందఁగన్ 147

వ. అంత నాహారన్నగలతెగల ముద్గుతమ్మునకుంజూపిన రామ! నిత్యంబునామహాదేవి పదపద్మమ్ముల కంజలిజల్పనేగి కాంచువాఁడ నేనునెఱుంగనే హారన్నందియలు మొదలయినవానినని కొంతవడిదుఃఖించి యున్ననూరార్పనంత రాముండు సుగ్రీవా రావణుండెందుండెనో తెల్పుమాయఘమతి ఖండించి దేవిందోడ్తెత్తునన రామునెట్ట కేలకుప్రొద్దు పట్టిఁయూరార్చి యిట్లనియె. 148

[సుగ్రీవుఁడుసీత దెచ్చుట పొంటెప్రతిజ్ఞఁదీయుట]

ఉ॥ దేవ!మహానుభావ!భవ • దీయసతీతిలకాపహారిచా
చేవయుశక్తియుంగొలము • జెన్నగువీడునెఱుంగనైననా
లావరిఁబుత్రమిత్రయుతు • లాఘవమారనశింపఁజేయుచున్
నీవరవర్ణినీమణిని • నీదరిఁజేర్చదినాఁడువీఁడుసు

శ్రీవుఁడ!పద్మినీధవుని • కింప్రియపుత్రుఁడనీకుమిత్రుఁడా 149
ఉ॥ నీవునుదమ్మిగుఱ్ఱఁడువ • నింజరియించెకుపట్టునర్ రమా
దేవికినీడువచ్చెడుస • తీమణిప్రుచ్చిలినట్టియాదశ
శ్రీవునిఁగూల్పనీకనిన • రీతినటింపనినాఁడువీఁడుసు
శ్రీవుఁడపద్మినీధవుని • కింప్రియపుత్రుఁడ!నీకుమిత్రుఁడా 150
ఉ॥ నావిమతుండురంబునన • గొంచినతింగొని రాజ్యమేలుచున్
నీవిమతున్ ధరాస్థలిన • నింబడమొత్తి పడంతిదేగబల్
తీవినినీకుఁదోడుగను • డీకొనకుండిననాఁడువీఁడుసు
శ్రీవుఁడ పద్మినీధవుని • కింప్రియపుత్రుఁడ నీకుమిత్రుఁడా? 151
ఉ॥ చేవదొఅంగ సేలమది • చేడియకై దురపిల్లసేలయీ
పావనిఁబంపినీదుప్రియ • భామినియుండినచోటెఱింగి ని
న్నావనితాశిరోమణిర • యంబునఁగూర్పనినాఁడువీఁడు సు
శ్రీవుఁడపద్మినీధవుని • కింప్రియపుత్రుఁడనీకుమిత్రుఁడా 152
ఉ॥ సేవనితందొఅంగ నెవ • నింజరియింప నెవీఁడువీడ నే
లావరివీవునాప్తురన • లాంతులుమాన్పెడువారెచూడునా
లావవనీసుతంగొనక • లంతిగ వచ్చిననాఁడువీఁడుసు
శ్రీవుఁడపద్మినీధవునికిం • ప్రియపుత్రుఁడనీకుమిత్రుఁడా 153
వ. ఇట్లు పలికిన నాలించి సూతునకు శౌనకాదు లిట్లనిరి 154
క॥ సూతాసుజ్ఞానకళో పేతాధవిజుండుతనదు • పెంపెన్నెడు నే
లాతారాపతిదాడికి నాతఁడేలావతెచనండె • యది మేమన్నన్ 155
వ. అనిన సూతుండిట్లనియె 156
చ॥ ఇటులఁడుగంగఁగ్రీకి • మహేశ్వరుఁడన్నటు లేనుబల్కెదన్
జటివరులారవిన్దగుని • జమ్మిగవాలినిభానుజుండుము
న్నటు లెదురింపజాలకయు • యాఁగగ లేదుస్వకీయుఁడంచుదా
గుటిలతబూనకుండెసతి • గోల్పడిపూనెవిరోధమన్న పైన్ 157
ఉ॥ కూరిమి సేస్తి తద్విథిని • గొమ్మనురోయగబంపుదంచు ద
న్భేరిమిదేర్ప రాఘవుఁడ • నెందపనాత్మజవిమ్మనింక నే

నెఱిగలచెలి పరమగతిగ • గణింపఁగ రామా! 164

సీ॥ గూఢంపువర్తన • కు నమోమయపుబేటి
మేలకీళ్ళెఱిగించు • మేటిచేటి
పాలుపారఁగాఁ బ్రొద్దు • బుచ్చు విప్రవినోది
వైరివారణముగూల్పు • గజశేవి
గొప్పకార్యముసమ • కూర్పుపరుసవేది
పాయనిలేమిముల్ • దీయుసూది
సౌఖ్యదుఃఖములకూ • చగలట్టి తక్కడ
యాపదలణఁగింప • నౌషధపడ
తే॥ ఆత్మపోషణకుం బెట్ట • నట్టికోట
శంకలందీర్చి నడపింపఁ • జాలుబాట
యైజనావళికుపకారి • యైనసుజన
మైత్రిమించినదొకఁడే ది • క్ష్మాతలమున ॥ 165
ఆ॥ అక్కపల్కులెల్ల • నాలించి శ్రీరాముఁ
డంజనీసుతుండు • ననుగుదమ్ముఁ
డైనలక్ష్మణుండు • నాలింపవానివే
భంగులొక్కమొగిని • బ్రస్తుతించె ॥ 166

(సుగ్రీవుఁ డన్నకుఁ దనకుఁగల్గిన విరోధకారణము దశరథుల
కెఱిగించుట.)

తే॥ మఱియు రామునకర్క సం • భవుఁడు పలికె
వీపు వెడలంగఁగొట్టె నా • వెలఁదిబట్టెఁ
దర్పము సాగెను వాలి, గో • త్రమునఁ బశ్చితి
నార్తనాథుని రామ న • న్నరయుమెట్టొ ॥ 167

సీ॥ రాజువాలిగ యువ • రాజును నేనుగా
నుంటిమి కొన్నాళ్ళు • నంటినతమి
నంతటసన్నన్నొ • యనరానిమాటల
నొక్కుమ్మడిగ నాఁడి • యొక్కనాఁడు

ప్రాణానకెనయైన • ప్రాణేశ్వరినిగొని
చెఱసాలనావారి • నఱవఁద్రోచి
పదపడినాఁతల • ప్రాణమ్ము తోఁకకు
వచ్చెలాఁగేడ్పింప • జొచ్చెనన్ను
తే॥ విడక నాపైనిజంపంగ • వేసెఁగన్ను
చక్కనెన్నే యుపాయముల్ • సంతరించెఁ
బన్నె నెన్నే నియుక్తుల • జెన్నటిమదిఁ
జెప్పవశమటె యాంపాపి • సేయుకీడు ॥ 168
ఆ॥ పంపబంపనాదు • పైకిసేనలవారి
జంపజంపనరిగె • జాలకాల
ముందుచేత సీర • లరుదేరమేమెల్ల
నళుకవలసె భీరు • డళుకఁడొక్కఁ ॥ 169
క॥ వనచరవరేణ్యుఁడగు నీ,
హనుమంతుండు మొదలైన • యాత్మసచివు లి
వ్వనమున జతగాదిరుగఁగ
మనుచుంటిని రామచంద్ర! • మలయిలుగాఁగన్ ॥ 170
క॥ నిలిచిన నిలుతురు వెలలిన,
వెలలుదురమ్మంత్రివరులు • వెంటనె జతగాఁ
బలుపాట్లువడిరి నాకయి,
కలునను నాప్రాణమిపుడు • గాచిరిసుమ్మా ॥ 171
ఉ॥ వాలిని నెన్నికష్టముల • నందితినో తెలుపంగఁజాల నె
సాలిని తేను నీకిపుడు • సంగ్రహఫక్కిని బల్కెన్నాడ న
వ్వాలిని వానిసేన నిల • పైబడఁగూల్చినగాక నాదు కాం
తాళినికూడి కూర్కెదనె • హాయినిరామ! యదేటిమాటలే ॥ 172
క॥ బిట్టులయినకష్టమ్ముల, నిట్టులనటఁబలుకనలసె • నెంతయునీకీ
పట్టునసుఖియో దుఃఖియొ, నెట్టన స్నేహితుఁడదిక్క • స్నేహితుఁడకటా

కవిరాజ వినివి శ్రీరఘువీరుఁడునర్కజు• వేసటమాటల• వేమరునా
విరా॥ తనికనుసూర్యసు• తా! మునునీకుశ• తక్రతుసూతికి• తంబుననుం
డిననెటుగల్గెగ • డిందివిరోధము • డీకొనబల్కి-పు • డేతెలియన్
మనమునశోకము• మానుముధీరుఁడు• మాటికిగుందుట• మంచిదొకో
కవిరా మొగిసిబలాబల• ముల్ మదినారసి• మోసలకార్యము• బోణిమిగా
జవిరా॥ దగినటుజూతము• తావకరీషక• ధన్ వినవాకు నె• దంగినుకెం
తగనోజెలంగెను• దామరసీటటు• నామదిచంచల• తంగనెనీ
పగతుడనాపగ• వాడనినమ్మము• వానరనాయక• భావములో

క॥ ఎన్నఁగవిలుమోపెట్టక, మున్నవచింపైంద్రివైర• మునకుఁగతంబుం
బన్నగరాణ్ణిభశరమా, సన్నంబైనగివునడచి• శరధింజొరుఁజూ ॥

వ॥ అసిన నమ్మాటలకు మార్తాండనందనుండలరి యిట్లనియె. 177

సీ॥ బ్రహ్మకుమారుండు • బ్రథమవృక్షచరుండు
నగుబుక్షువిరజునీ • కమరనాథు
నంశంబునవాలి • యర్కాంశమునెనేను
గలిగి తండ్రికిముద్దు • గొలుపుచుండ
మజ్జనకుఁడుతపో • మార్గంబునమెలంగఁ
దలచిపెద్దకొమారు • దనదుగద్దె
నిలిపి పిన్నకొమారు • నెలమినన్యువరాజు
గానిల్పి చనెహొన్ను • గట్టుకడకు
గీ॥ నేనుభక్తినిగొలువగా • నియతినేలె
వృక్షచరరాజ్యమెంతేని • నివలవాలి
యవలమాదురదుష్టద • శవలననల
మఁనునిఁమానుఁడు మాయావి • మదముఁ కేగి ॥ 178

చ॥ ఒకమొలనాగకయ్యు పగ • నూని మదీయపురంబువాకిటం
బ్రకటముగాగ నార్వవిని • వాలిజతారి తదీయగ్రైత్యపై
నొకఁడురుకంగ నేనరిగి • తొయ్యనగూడ సురాభియాతి య
ట్లొకగిరికందరాన జొరె • నొడకనన్నటనిల్పి వాలియున్ ॥ 179

చ॥ వెనుచనెనంత నేను కనిపెట్టి • యొకబ్దమటుండవచ్చె న
ప్పెనుగుహవాత నెత్తురు స • ఫేనముగా నటదానవార్భటుల్
వినఁబడెవాలిపల్కఁ • డు విన్బడకుండె నెటాలకించినం
బనపుచునేను నవ్వెనుక • వాలినశించెనటంచు నెంచుచున్ ॥ 180

మ॥ పురముం జేరి తిలోదకాలొసగి నే • భూరివ్యధన్మగ్గ ద
ద్వరమంత్రుల్ కపిరాజ్యమందునను ని • ల్పన్వచ్చెమాయన్న స
త్వరతం దద్రిపుబుత్రమిత్రయుతు జి • వ్వంగూల్చి రాయన్న! ని
ర్జరవైరిం దునుమాడివచ్చితె యిదే • రాజ్యంబు నేలొమ్మనన్॥

క॥ "బడ్డువిరిగి యొన్కమ్మడి; బడ్డపగిది" నాదుపైన • బడితిట్టినను
జడ్డనవెళ్ళదరమె నే, "గడ్డముబట్టిబతిమాలఁ • గా" వినడయ్యెన్॥

క॥ కొట్టెను తిట్టెను బురికడ, నెట్టెను నావారినిజెఱ • నెట్టెనుదిప్పల్
బెట్టెను నాభార్యను జే, పట్టెను నిర్దయుతనింద్రు • పట్టిక్షితీశా! ॥

క॥ నన్నింతకష్టపెట్టిన, జన్నఁపుగాపరి! యెమర్ప • జాలకగాదే
నన్నకదాయని దురమున. కున్నడువకయుంటినంచు• గోడెత్తంగన్

క॥ వినిరాఘవుండు రవినం, దనునకుబల్కె నందన • నా! నీవెతలె
ల్లను నావెతలేటికడల, నినుఁగా చెదనన్నరి కే • నెఱిజేసికనున్ ॥

క॥ శ్రీరామచంద్ర! వజ్రిసు, మారాగ్రణి బలపరాక్ర• మమ్ములువిని మీ
రారూఢిసేయదగినటు, నేరుపుమైసేయవచ్చు•నియతిననియనున్ ॥

క॥ కొండలగైకొనియచ్చన, గండ్లుంగానోతఁడాడు • ఘనబలుడనిత
గొండాడనెల్లవారలొ, కంఠుభయంబన్ననవ్వు • గదభీలేమిన్ ॥

వ॥ మఱియును 188

ఉ॥ తూరుపుసంద్రమందుఁ గొల • దూలగస్నానమొనర్చి వార్చి యా
పైరహిందక్షిణాబ్ధికి జ • వంబుననేగి కడంకగ్రుంకి త
ద్వారిధి దాటి పాశిదిగ • పాంపతిమున్ని యుదీచివార్ధికిం
గోరికనేగి క్రుంకులిడి • గొబ్బునవచ్చును మన్కికూర్పకున్ ॥ 189

క॥ దినదినమిటుసూర్యోదయ, మునకుంబూర్వంబుపో యి• మొగిగష్టము
నాకనఘూనచ్చుచు గైదండవలుకుఁభలిఘోరుకపడవ • నక్షితిజమ్మున్॥

వ॥ వెండియు, 191

సీ॥ తొలివేల్పుసాన్నార • తొలుచూలునకుమున్న
తద్భ్రాతసైరిభ • తనువుదాల్చి
దొడ్డకేకనువేసి • దురమునకుంజీర
మాయన్న రేనాకఁ • దాయఁదాకి
కొండలదరువుల • గొంతసేపటువ్రోరి
దానిశృంగమ్ములఁ • బూనికేల
నేలగొట్టియడంచి • నిగిడియోజనదూల
మువిసరివేయగా • మునిమతంగు

గీ॥ నాశ్రమోర్విజములు • నడగంగబడిదాన
నెల్లజాలుకొల్పె • నల్లవాక
దానిగాంచిమహాని • తత్కారణంబెంచి
వాలియిందుఁ రాగ • గూలుననియె 192

క॥ ఏతత్కారణమునఁగపి, నేతయిటకురాఁడుగాన • నేనిల్చితినో
సీతాపతి!యీతావున, నాతా రేసునుకునోడి • హాళిగదురగాఁ॥

క॥ దానవుకళేబరంబిదె, మానోకొండో యనంగఁ • గాలుంగను మా
పైన సతతాడులంగను, వానినిగ్గై వంచిపండ్లు • వాలిభుజించుఁ॥

ఆ॥ పూసగ్రుచ్చినట్టు • వాసవనందనుబలపరాక్రమములఁ • బల్కనాడ
నీకువానినెట్లు • నిర్జింపగాఁ మనో బల్కునాకురామ! • బ్రధనభీమ॥

క॥ నావుడులచ్చననగి సుగ్రీవుఁడ! యితడేమిసేయఁ • గిశవ రేణ్యుఁ
లావుమెయిదున్నఁగలఁడని, నీవు మదిన్నమ్మదన్న • నెవ్వఁడనుఁ

మ॥ ఒకహస్తమ్మున దాళసప్తకము నే • ర్పొవ్వారగావచ్చి కొం
డొకహస్తమ్మున పండ్లుదుల్చితినునో • హేలానాగగవ్వార్పల
ట్లొకబాణమ్మున సప్తతాళముల నే • ర్పొవ్వారదున్మాడి గొం
కకఁ బాదమ్మునదైత్యుదుందుభి మహా • కాయమ్ము నెుక్కుడునఁ

క॥ ఇరునూరువిండ్లదూరము, నిరుపమగతిమీఁటెనేని • నేనమ్ముదునం
చురుగుణుఁడునర్కవలుకుచు, గరుణానిధిరాముగాంచికడులొంగియనుఁ

క॥ వాలివినిర్జితదానవపాలి, విధూతరిపుసైన్య • పాళివితతదో
శ్శాలి వికాసితవిక్రమ, శ్శాలివిభుతకోడియుంటి • శైలంబందుఁ ॥
క॥ అని కన్నీరున్నించిన, గని రాముఁడు ప్రొద్దుకూనఁ • గరుణదొలుక వే
డ్కనిలవుమర్కజ! నీరిపు, దునిమిత్వదీప్సితముదీరు • తున్నే ననియెన్

[రాముఁడు దుందుభికళేబరముఁ బొటవ్రేలఁజిమ్మి
తాళసప్తకం బొకమ్మునంగూల్చుట.]

మ॥ ఇటులూరార్చిదివాకరాత్మజునిరా • జేంద్రుండుతత్కాయముం
బొటవ్రేలన్వడి.యోజనంపుదశకం • బుంబాఱిగామీఁబెద
త్పటుసత్త్వోల్కపికుంజరుల్ వొగడఁగాఁ • దాఁదూలికంబోలెను
త్కటసత్త్వుండగునర్కదానిగనిజో • కన్ రాముతోనిట్లనున్ 201
ఉ॥ రామతదీయకాయమును • రప్రభుసూనుఁడుజిమ్మెనాఁడుప్రో
ద్దామతరంపుమాంసమునఁ • దృక్కునెరక్తమునంబ్రపూరితం
బై మఱియుండెవాలియు • దదాహవమందునడస్సియుండెని
ష్టామఱినట్టిశుష్కముగ • దాయిదికావుననమ్మనిన్నికన్ 202
క॥ అప్పుడుమాంసోపేతం,బిప్పుడుమాంసరహితంబు • నీరిరువురలో
జెప్పుడులావరియెవ్వరొ, ఇప్పుడునే నెరుగనేర • కిట్లుంటినృపా 203
క॥ ఈకార్ముకమునచిల్కడి,యాకర్ణాంతముగదిగిచి • యగములొకే
కీకంబుడమింగూల్చిన, చోఁగౌశికిశిష్యయియావె • పోయెక్కువికన్
ఉ॥ అనవినితాటకాంతకుడ • హస్కరసూనుఁడునమ్మినట్లుగన్
ఘనతరకార్ముకంబొకఁడు • గైకొనికాంచనపుంఖమార్గణం
బునుఁదొడిబిట్టులాగినగ • ముల్గురిజూపివడిన్విడెంగుణ
స్వనమున నెల్లదిక్తటులు • బ్రస్ఫుటరీతినిమారుమ్రోగఁగన్ 205
శా॥ ఆతండిమ్మువిడంగనిట్లదియుఁదా • శ్శ్యారొండునంతంతభూ
పాతంబై చనజేసియంతటవడిం • బాతాళగంగందగం
జేతంబుబ్బగస్నానముంజలిపియా • శ్రీరామునమ్ముల్ పొదిం
నీతంబారఁగఁజేరెఁజూపరులునెం • తేవేడ్కఁగొండాడఁగాన్ 206
క॥ ఈగతినగముల్ గూరినిడి, వేగమనేఘుఁ గఁదాళ • వృక్షము లేడుం

దూగిపడగాంచిరవిజుఁడు, భోగిశయానుండ్డాయుచుఁ • బుద్ధిందలఁచెఁ
వ. ఇట్లతండు 208

ఉత్సాహ పాణియుగముమోడ్చిచక్ర • పాణిసముఁడవయ్యయం
చాణిముత్తెపున్సరులుగల • ట్టరు పేటురమిలం
బోణిమిగనుసోకమొక్కి • భూమిజామనోహరా !
వాణిమెఱయగెల్తుపీవె • వాలిగిలిలెక్కయే 209

క॥ అనిపలువితములరఘురా, మునిదోర్విక్రమముపొగడి • భూమిశనను
గనికరమునగనిగావవె, వినిహతుగావించివాలి • వేగమయంచుఁ 210

క॥ భూతేశసదృశబలునిను, సీతేశాపడసినాడ • స్నేహితుగానా
భూతేశుడెత్తియిటరా, నీతేలెదనన్నవాలి • నేలాతలపఁ 211

క॥ అనిప్రస్తుతించిరాఘవు, డనివాలివధించగల్గు • ననినెమ్మదిలో
ననమ్మినిల్చెననిప, ల్కినవ్వాలికతనుదెలుప • గెరలించుటయుఁ

ఆశ్వాసాంతము గోమూత్రికాబంధము

క॥ తారధరాధరధీరా! శారదనారదవిభాళి • సమవిమలయశా
ధీరవరాదర!వీరా!సారఘనాంబుదశుభాఙ్గ • సమవిపులదశా 213

చతుర్విధకంద గర్భితమణిగణ నికరము

ధరధరపదరత • దయగనువరధీ వరకవిజననుత • వరగుణశరధీ
స్వరుధరవిభవసు • జనహితధరధీతరళనయనస్మర • ధనదవితరణా 214

మాలిని వరకవిజనరక్షా • వైరిసందోహశిక్షా పరమకృతిపరీక్షా • భక్తసంచారదీక్షా
హరకమలదళాక్షా • ర్స్వచ్ఛ మాల్యస్థవక్షా • ధరణిదివిజపక్షా • దైవపాదాబ్జకాంక్షా

ఇది శ్రీమదచ్యుతచంద్ర శిరోరత్న నిరవద్య నృగచరిత్ర కృతిరచనాచాతురీ ధురంధర సద్య
శోబంధుర కౌండిన్యగోత్ర కలితాపస్తంబసూత్ర చతుర్విధకవితామతల్లికాబ్జరాజాస్య
యశఃపయఃపారావారరాకా కైరవమిత్ర నృసింహామాత్యపౌత్ర, మంగాంబా శేషా
చలామాత్యపుత్ర సుధీజనవిధేయ మానవల్లి రాయనామధేయ ప్రణీతం
బైన శ్రీమత్సుగ్రీవపట్టాభిషేకంబను మహాకావ్యంబునందు
చతుర్థాశ్వాసము.

• శ్రీసుగ్రీవపట్టాభిషేకము •

పంచమాశ్వాసము

క॥ శ్రీముత్యాంబామణిముఖ, తామరసాసితమదాళి • తలజరాజాం
బామణిగర్భజసద్గుణ, ధామపకీరయసనామ • తపనసుధామా

క॥ అటమీఁది తెలుఁగువినుమ, కుత్కటకరుణాంజనద్రధరుఁడు• గాళికిక్షితిభృ
త్కటకమునసుడువువమున్న, నటసూతుఁడువలికెమునుల•కవలికతవినరే

[ సుగ్రీవుఁడన్నంగెడిపితన్ను గావరఘురాము వేఁడుకొనుట ]

ఉ॥ అంజలిఁజల్పి రామునకు • నర్కజుఁడప్పుడు రాఘుచంద్రనా
నెంజలివాపినాకునయి • నిర్జరనాయకసూతిఁద్వచ్ఛరా
గ్నింజివికుర్విఁగూల్చికృప • నింపఁగదేయని వేడినన్మదిఁ
రంజిలి రాముడిట్లనుగ • రమ్ములఁగుచ్ఛికవుంగిలించితాఁ 3

క॥ ఖేదముడుగుకిష్కింధకుఁ, బోదముపదబిల్వమింద్ర•పుత్రునిఁద్వరగా
వాదమునకుజలువుముహారి, నాదముఁదద్వారసీమ • నభమఁగలంగన్

[ రామసుగ్రీవాదులుకిష్కింధపయినెత్తి వెడలుట ]

సీ॥ మిత్రాత్మజుండును • మిత్రాత్మజుఁడు
మున్నున్నుగామార్గమ్ము • మొగినిజూప
నలనీలపవమాన • నందనతారులు
బ్రక్కలభటకోటి పగిదిదోప
స్వర్ణభూషితశరా • సనము
లర్కాభబాణమ్ములుర్విశచి • హాసములుజూప
బత్రపుష్పఫలప్ర • భాసమానోర్విజ
నగనదుల్ కనుపండు • వుగనుదోప
దేవతాస్త్రీజనోపేత • దేవఘూతముల
కుసుమమంజరీకుంజ • పుంజవాత
చలితపుష్పదళాంతర • స్థానచకిత
భృంగఘూతకుసుమగంధ • బృందవిభూత 5

క॥ దరచక్రమత్స్యరేఖల, సరసోర్మికకంకణములఁ • జానగుపద్మా

కరములఁ బోలినపద్మా, కరములనుత్తుంగశృంగ • కలితాగములన్

చ॥ మదజలధారలన్మధుప • మండలితృప్తి వహించి వాదముల్
పదపడి సేయఁగర్ణములఁ • బాఱఁగఁ దోలుచుఁ బాదఘట్టనన్
బెదరిమృగాళి వాఱఖగ • బృందము మింటనుగ్రేఁగ్పు వాఱఁగా
మదగజబృందముల్ సరసి • మండలితీరములం జరింపఁగన్ 7

ఉ॥ తొండములం జలంబులన • ధోగతిబీల్చి సమీపనాగముల్
గండములందుఁ గుంభములఁ • గ్రక్కునఁ జిమ్ముచు దన్మృణాళపుం
గాండములం బెకల్చితమ • కైమెడలంగయి సేయుచున్ భుజా
దండములం స్వవంశజుల • దాఁకుచు వారివిహారమర్మిలిన్ 8

క॥ హత్తి పదువుజరుపఁగమద,
మెత్తి పదువులగుచుఁగూడి • యేదులుగుమ్మల్
మొత్తి పడఁద్రొబ్బి రాల్చిన
ముత్తైపు రాసులను జేఁడు • బారిగనుచ వలన్ 9

[రామునకుసుగ్రీవుడు గదళీవన ప్రభావంబు దెల్పుట.]

క॥ కదళీతరుషండంబుల
బోదలెడువన మొకడుగాంచి • భూమిపుడక్కిన్
ముదమునగనిపల్కెన్
మ్మదికవ్వనిముదముఁగొల్ప • మఱిమఱి వేడ్కన్ 10

సుగంధి సూర్యరశ్మిజొచ్చనీక • జోకనిర్లుగమ్మనో
సూర్యపుత్రకాకడంక • జుక్కలంటుగొమ్మలన్
దైర్యమార నేరుచొచ్చి • నమ్మదమ్మునిచ్చునీ
యార్యవాసయోగ్యమైన • యంటితోఁటయేరికో 11

తరల అనగనక్కజుడిట్లువల్కెబ్రబ • యాణమర్మిలిజల్పుచుం
జనకజావరమున్ను • సన్మునిసప్తకంబనిలాశనం
బునజలాంతరమందునిల్చిప్ర • మోదమారమహావ్రతం
బునొగిసల్పిదివంబు జేరిరి • భూరితేజములందఁగన్ 12

చ॥ సురవరులేనినిర్జరని • షూదనులేనిబ్రభీతినివ్వనిన్

జోరరరుదారనేఖగము • సున్మృగముంజోరదేగనేరమిం
మఱియుసుగీతవాద్యరవ • మర్దళరావమువిన్గనౌబొరిం
బొరివలిగాలివీచునిట • బొల్చునువహ్నులుమూఁడునెప్పుడున్ 13

క॥ గగనమునసలమితధూ
మగణముజలముగ్గణంబు • మాద్రిగనెపుడున్
జగదీడ్యమగుచుమెఱయున్
భగణంబులనంటికప్పి • భూభ్రిఘదమై 14

చ॥ అనఘచరిత్రనీవనుజు • డమ్మనిరాజులకిప్డుమ్రొక్కుఁడ
ట్లానరుఁపగానరోగతను • సుందరటన్నసుసానుజుండునై
జనకసుతాధిపుండురహిఁ • జాగిలిమ్రొక్కెఁహుటాహుటిం వెసన్
వనచరరాజపట్టణవనమ్ములఁ • జొచ్చిరియందఱాదటన్ 15

(సుగ్రీవుఁడన్నంజివ్వాకుఁబిల్చుట)

ఉ॥ అప్పుడుమంజుకుంజసిచ • యావృతమైనవనాంతరంబునం
జప్పుడుగాకయుండక్షితి • జానియుదమ్ముఁడునుండనర్కజుం
డప్పువిధారిసూత్రిబళ • యూంబుదరావమునీడవుచ్చుబల్
గొప్పరవంబునంబిలిచెఁ • గోటకుముంగలనిల్చిచివ్వకున్ 16

చ॥ అదివినివజ్రిపుత్రుఁడుద • యాద్రినిఁదోచుదినేశుభాతినె
మ్మదిగినుకంపురంబునకు • మందుచురాదుములంపుఁగయ్యమెం
చఁదగినపారలిర్వురకు • సాగెనభంబునసౌమ్యభౌముల
ట్లదరఁగఁజేయుదిక్తటులు • నాత్మమహాహవసింహనాదముల్ 17

క॥ కరికరిగిరిగిరిహరిహరి, బొరిబొరిదాకినటుదాకి • పోరిరివారల్
మఱిమఱిరవరులిరువురు, సరిసరియనిపొగడముష్టి • సంఘాతములన్

వ॥ ఇట్లుపోరాడుచున్నంత 19

ఉ॥ లానరిరాఘవుండుకర • లాఘవమారఁగఁగార్ముకమ్ముఁగై
జేనదలిర్పఁరాల్చిరహిఁ • జేసియుసజ్యమువారలశ్వినీ
దేవతలట్లురూపమున • దేజునదుల్యతఁగ్రాలవీఁడుసు
గ్రీవుఁడువీఁడువాలియని • కీసయునెంచఁగలేకభేదమున్ 20

(సుగ్రీవుఁడాహవంబున నోడి మరల ఋశ్యమూకముం జేరుట)

ఉ॥ అంతట బాణమున్విడువ • దయ్యె మహారమణుండునర్కజుం
డింతటిలో సురేంద్రసుతు • నేటులనొచ్చి కృపాబ్ధి రాముడ
ల్లంతటనుండఁగన్గొనక • నార్తిని బాహుబాలి దోలఁగా
నెంతటివాని జేరిన”నఁ • దృష్టవిహీనుఁ డకబ్బు సిరుల్ 21

ఉ॥ ఈగతి ఋశ్యమూకమున • కేగిన వెన్కఁ డివాసవాత్మజుం
డేగతి నేరకందుఁ జేర • నీర్ష్యత వానికిఁ బల్కునిట్లుని
స్సీగతి లేక భీతినిట • జేరితి వేయని వాన రాధమా
మాగతిఁ బోరె దేమడగి • మంటివి పొమ్మని పోయెనింటికిన్ 22

సీ॥ రామలక్ష్మణులప్డు • రహిఁ గొంజరిఁజు
దొట్టికోతులరానిజో • గులను మించి
ఋశ్యమూకాద్రికి • నేతెంచి రవిపట్టి
మోస్లనిల్వనతండు • మోము వాంచి
వ్రీడతో శ్రీరఘు • వీరునితోఁ బల్కు
నగచరపతిదాక • నన్ను బంచి
వైరిచేఁ జంపింప • వచ్చినలాభంబా
కింత లేదీరికి • నిటు పచించి

నదియొకండు నొనర్చిన • యదియొకండు
నైన నావంటివాఁడె • ద్విధమైనయొండు
సేయనేర్చునె,“కంచెయే • చేను మేయ
కాపికేమి యొనర్చు,,నో • కౌసలేయ 23

[సుగ్రీవుఁడన్నందును మమికి రాముండూరుట]

ఉ॥ ఎత్తి కుదించివంచిపడ • నేసితిగోడను మంటి సుద్దలా
గిత్తఱిరామనిన్ననగ • నేటికి నాదురదృష్టమేర్చఁగా
నత్తఱివాలి గెల్వఁగల • మాయని తేలగబల్కనయ్యయో
ఇత్తఱివాలినే బిలుతు • నేబలహీనుఁడు గెల్పుగోరునే 24

తే॥ ఘూలిగెడినక్క పైతోడి • బొండ్లమువడి

